తెలుగు మెఱుగులు
గ్రంథకర్త:
శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రి
వెల రు. 2/- తపాలాఖర్చులు 0 7 0
ఆంధ్ర గ్రంథమాల,
6,7, తంబుశెట్టివీధి, మద్రాస్.

# ఆంధ్రపత్రిక

ఫిలిం ప్రేక్షకుల అభిమానతార
భానుమతి నటించిన
భరణీ వారి
రత్నమాల
త్వరలో
మద్రాసు స్టార్ టాకీసులో
ప్రదర్శింప బడనున్నది.

3/7591

The Andhra Patrika, Madras. } Regd. No. M. 1118 Vol. 36 No. 232 FRIDAY 25th NOVEMBER 1949 వెల ఒకఅణా } Founder: K. NageswaraRao

# జనవరి 26 న భారత రిపబ్లిక్ తాత్కాలిక అధ్యక్షుని ఎన్నిక

## 15 పరిశ్రమలలో అధికోత్పత్తి

### చక్కెర, కాగితం, బొగ్గు మొదలైనవాటికి వచ్చే ఏడాదికి ప్రమాణాల నిర్ణయం

న్యూఢిల్లీ, నవంబరు 23: భారత ప్రభుత్వం దేశంలో ఉన్న పరిశ్రమలలో సుమారు పదిహేనింటిని పురస్కరించుకొని అవివచ్చే సంవత్సరం లక్ష్యంగా పెట్టుకోవలసిన ఉత్పత్తి ప్రమాణములను నిర్దేశించింది. ఈ ఉత్పత్తి ప్రమాణములు తాత్కాలికంగా నిర్ణయించబడినవనీ, ఇంకో పదుంరోజుల్లో ఖాయమైన ప్రమాణాలు ప్రకటింపబడతవనీ, భారతప్రభుత్వ పారిశ్రామిక శాఖాకార్యదర్శి ఎస్. వి. వెంకట్రామన్ చెప్పెను.

వివిధ పరిశ్రమలలోను ప్రభుత్వ నిర్దిష్టమైన ఉత్పత్తి లక్ష్యాలను సాధించడానికి ఏ మార్గాలు అవలంబించి పనిచేయాలో సూచించగలందులకై కార్యాచరణ సంఘములను నియమించవలెనని కేంద్ర పారిశ్రామిక సలహాసంఘం [illegible]

[illegible]

బడినది. కొన్ని కొన్ని పరిశ్రమలకు బొగ్గు రవాణాకింద అయే ఖర్చునుకూడా తగ్గించాలని ప్రభుత్వం యోచిస్తున్నది. రైల్వే రవాణా ఛార్జీలు బట్ట, కాగితం, సిమెంటు అను ఈ 3 పరిశ్రమలకు ప్రధానంగా [illegible]

[illegible]

రకం బొగ్గు ధరను టన్నుకు 9 అణాల చొప్పున తగ్గించడమైనది. "సాఫ్ట్ కోక్" అనబడే రకం బొగ్గు ధర 15 అణాలు తగ్గించబడును. ఈ ధరల తగ్గింపుమూలంగా పరిశ్రమలలో బొగ్గు ఖర్చు సగటున నూటికి 4 వంతులు తగ్గుతుందని అంచనా వేయ [illegible]

ఇవ్వబడదు; ఏయే పరిశ్రమలకు సాయం చేయాలో నిర్ణయించేపని ఛీఫ్ కమీషనర్లకు అప్పగించబడును. ఛీఫ్ కమీషనర్లకు ఈ విషయంలో సలహాలు ఇవ్వడానికి కమిటీలు నియమింపబడును అని వెంకట్రామన్ గారు వెల్లడించిరి.

## బళ్లారిలో విమానాశ్రయం స్థాపన

### ఇప్పట్లో సాధ్యంకాదని భారత ప్రభుత్వం జవాబు

బళ్లారి, నవంబరు 23: ఇచ్చట ఒక విమానాశ్రయము నిర్మింపవలెనని గత ఏప్రిల్‌లో రాయలసీమపరంగా సమర్పించిన విజ్ఞాపన పత్రమునకు భారత ప్రభుత్వ రాకపోకలమంత్రిత్వ శాఖవారు ఈ దిగువ సమాధానము పంపిరి. "గుంతకల్లులోకాని, బళ్లారిలోకాని ఇప్పట్లో విమానాశ్రయము [illegible]

[illegible] లేపించినప్పుడు, మీ వుత్తరములో సూచించిన అంశములను, బళ్లారి కలెక్టరు అందుపై కావించిన ప్రతిపాదనలను, స్థల నిర్దేశమునకు ముందుగా యథారీతి ఆలోచించబడును."

## పరిషత్ ప్రత్యేక సమావేశం

### జరుగునని రాజన్‌బాబు ప్రకటన

### 'శనివారంనుంచే రాజ్యాంగంలోని కొన్నిభాగాలు అమలుకు రాగలవు'

న్యూఢిల్లీ, నవంబరు 24: నూత్న భారత రాజ్యాంగమును ఆమోదించవలసినదని డా॥ అంబేద్కర్ ప్రతిపాదించనున్న తీర్మానముపై నవంబరు 26, శనివారంనాడు ఓటు తీసుకోవటం జరుగుతుందని పరిషత్తు అధ్యక్షుడు డా॥ రాజేంద్రప్రసాద్ నేడు ప్రకటించారు.

ఈ తీర్మానం ఆమోదింపబడినతర్వాత సభ్యుల సమక్షంలో రాజ్యాంగమును అధికారరీత్యా ధ్రువపరుస్తానని, దానికిముందు పరిషత్తులో తాను ప్రసంగించగోరుతున్నానని కూడా డా॥ రాజేంద్రప్రసాద్ అన్నారు.

అయితే సభ్యులు ఆరోజున నే రాజ్యాంగంమీద సంతకాలు చేస్తారా అని పండిట్ లక్ష్మీకాంతమైత్రా (పశ్చిమ బెంగాల్) అడగ్గా, సమాధానం చెబుతూ, జనవరి 25 న గాని, 26 న గాని పరిషత్తు మరోకసారి సమావేశమై అధ్యక్షుని ఎన్నుకుంటుందని, ఆ తరవాత రాజ్యాంగం మీద సంతకాలు చేయమని సభ్యులు [illegible]

(4-వ పేజీ తరువాయి)

## 1935 ప్రభుత్వచట్టంలో 290 సెక్షన్ సవరణ

### 25-వ తేదీన అంబేద్కర్ బిల్లు ప్రతిపాదిస్తారు

న్యూఢిల్లీ, నవంబరు 23: రాష్ట్రాల పేర్లు మార్పుచేయడానికి గవర్నరు జనరలుకు అధికారాలిస్తూ 1935 ప్రభుత్వ చట్టాన్ని సవరణచేయడానికై న్యాయశాఖామంత్రి డా॥ అంబేద్కరు 25 వ తేదీ శుక్రవారంనాడు రాజ్యాంగ పరిషత్తులో ఒకబిల్లు ప్రవేశపెట్టనున్నారు. అది ఆరోజే ఆమోదించబడి 26 వ తేదీ నుండి అమలులోకి వస్తుంది.

1935 చట్టంలో ఇప్పటికి మూడు సవరణలు జరిగినవి. ఇది నాలుగవది. ఈచట్టంలోని 290 వ సెక్షనులో కొత్తక్లాజు ఒకటి చేర్చబడుతుంది. 290 సెక్షను ప్రకారం గవర్నరుజనరలు కొత్తరాష్ట్రాలు ఏర్పరచవచ్చు, ఉన్నరాష్ట్రాల సరిహద్దులు మార్చి వాటిని తగ్గించవచ్చు, పెంచవచ్చు. కాని రాష్ట్రాలపేర్లు మార్చడానికి అవకాశంలేదు. నూతనరాజ్యాంగం అమలులోకి వచ్చేలోగా కొన్ని రాష్ట్రాలవారు తమ రాష్ట్రాలపేర్లు మార్చాలనే అభిప్రాయం ప్రకటించారు. (యు. ప్రె.)

## కన్నడిగుల సత్యాగ్రహ వార్త

### అసత్యము అతిశయోక్తి అని బళ్లారి కాంగ్రెస్ నాయకుని ఖండన

బళ్లారి, నవంబర్ 23: బళ్లారి సర్కిల్ కాంగ్రెస్ సంఘ అధ్యక్షులు డి. హెచ్. వెంకోబా రావుగారు ఇలా వ్రాస్తున్నారు.

"కర్నాటక రాష్ట్రం శీఘ్రమే ఏర్పడాలని తీర్మానిస్తూ బళ్లారిలో మొన్న 20 వ తేదీన జరిగిన బహిరంగ సభను [illegible]

[illegible] వెంటనే కర్నాటక రాష్ట్రం ఏర్పరచాలని కేల్కారుతీర్పు కాంగ్రెసు సంస్థకు సంబంధించినంత వరకేగాని పరిపాలనాక్రియకు సంబంధించినదికాదనీ ఈ స్థాటిస్టు నేను మాట్లాడాను. మిగిలిన వక్తలుకూడా నేనన్న మాటలనే సమర్థిస్తూ ప్రసంగించారు.

## గోధుమల విక్రయంపై ఇండియా అమెరికా చర్చలలో ప్రతిష్టంభన

### తక్కువధరకు అమ్మడానికి అమెరికా నిరాకరణ: ఢిల్లీకి సర్ చింతామణి దేశముఖ్ ప్రయాణం

వాషింగ్‌టన్, నవంబర్ 23: భారతదేశానికి 10 లక్షల టన్నుల గోధుమలు అందజేసే విషయంలో అమెరికా భారత దేశాల మధ్యను జరుగుతున్న సంప్రదింపులలో తాత్కాలిక ప్రతిష్టంభన యేర్పడినట్టు, వాషింగ్‌టన్‌లోని భారతమంత్రివర్గ రాయబారి బి. ఆర్. సేన్ తెలియజేశారు.

గోధుమలకు అంతర్జాతీయంగా వున్న ధరకు తగ్గించి భారత దేశానికి అమ్మటానికి అమెరికా నిరాకరించింది. ఈ విషయమై సంప్రదింపులు జరుపుతున్న సర్ చింతామణి దేశముఖ్ విషయమంతా భారతప్రభుత్వానికి నివేదించటానికిగాను మూడురోజుల క్రితమే ఢిల్లీకి బయలుదేరారు.

ఇక్కడ సంప్రదింపులు కొనసాగిస్తూ వుండమని నన్ను ఆదేశించారు. కాని ఇంతవరకూ అలాంటి అవకాశమేమీ కనుపించలేదు.

"సెప్టెంబరులో అమెరికాకు వచ్చిన అనంతరం సర్ చింతామణిగారి సంప్రదింపులు ప్రారంభమయినాయి. అమెరికా ప్రభుత్వం యేదో పెద్ద సహాయం చేస్తుందనుకోవటంలో భారతప్రభుత్వం పొరపాటు పడ్డది' అని భారత రాయబారవర్గంలోని అధికారులు అన్నారు. ధర సమస్య విషయం ముఖ్యంగా యెత్తిచూపుతున్నారు.

మదరాసు, నవంబరు 24: మెడికల్ ఎడ్యుకేషన్ ఉపసంఘము సిఫార్సు ననుసరించి ప్రభుత్వము మదరాసు జనరల్ ఆస్పత్రిలో 'డీన్' ను నియమించుటకు మంజూరు చేసెను.

## శరత్ బోసుకు మావో సేటుంగ్ సందేశం

కలకత్తా, నవంబర్ 23:—చైనాలో కమ్యూనిస్టు రిపబ్లికు స్థాపన అయినందుకు అభినందిస్తూ సోషలిస్టు రిపబ్లికను అధ్యక్షుడు శరత్ బోసు పంపిన సందేశానికి సమాధానంగా చైనా ప్రజా రిపబ్లికను అధ్యక్షుడు మావో సేటుంగ్ ఈ కింది తంతి పంపారు.

"చైనా ప్రజా రిపబ్లికకు మీరు పంపిన అభినందనలకు ధన్యవాదాలు. సామ్రాజ్యవాదుల అతిక్రమణను ప్రతిఘటించడానికై చైనా ప్రజలు ఇండియా ప్రజలతోనూ, పీడిత ప్రజలందరితోనూ విపుల స్నేహం ఏర్పడాలని ఆకాంక్షిస్తున్నారు. —మావో సేటుంగ్"

## ముక్డెన్‌లోని అమెరికన్ ప్రతినిధి ఆంగస్‌వార్డుపై దేశబహిష్కరణ: కమ్యూనిస్టు న్యాయస్థానంలో శిక్ష

వాషింగ్టన్, నవంబరు 23: ముక్డెన్‌లో అమెరికన్ కాన్సల్ జనరల్‌గా పనిచేసిన ఆంగస్ వార్డ్‌ను చైనానుంచి వెడలిపోవలసిందిగా చైనా కమ్యూనిస్టులు ఉత్తర్వులు జారీచేశారు.

ఆంగస్‌వార్డు చైనాలో కూలివాండ్రను కొట్టినట్టున్నూ, వారిపట్ల అమర్యాదగా ప్రవర్తించినట్లున్నూ, ఆరోపణలనుచేసి, చైనా కమ్యూనిస్టులు, ఆయనను, ఆయనతో మరి నలుగురు అమెరికన్ ఉద్యోగులను అక్టోబరు 24 వ తేదీనాడు అరెస్టుచేశారు.

వీరిని కమ్యూనిస్టులు అరెస్టుచేయడాన్నిగూర్చి అధిక్షేపణ తెలియపరచవలసిందిగా అమెరికా విదేశాంగశాఖవారు ప్రపంచ రాజ్యాలకు విజ్ఞప్తిచేశారు.

అక్టోబరు 24వ తేదీన అరెస్టుచేసినవీరిని కమ్యూనిస్టు ప్రజా న్యాయస్థానంలో విచారించి శిక్షలు విధించారు.

ఈ విషయాన్నిగూర్చి త్వరలోనే ఒక ప్రకటనకూడా వెలువడుతుంది.

అమెరికాలో రెబెక్కర్ మెమ్ము యూనియన్ [illegible]

[illegible] గ్‌లో అమెరికన్ కాన్సల్ జనరలుగా వున్న ఎడ్మండ్ కబ్బుతో మాట్లాడారు. కబ్బ్ వెంటనే ఆవార్తను అమెరికాకు అందజేశారు.

వార్డ్ తనరిపోర్టు తానున్నూ, తనతోపాటు చిక్కిన నలుగురు ఉద్యోగులున్నూ [illegible]

[illegible] నుంచి బయలుదేర వలసిందిగా క్లబ్‌ద్వారా ఉత్తర్వులు జారీచేశారు.

## హిందీభాషసంస్కరణకై అఖిలభారత హిందీపరిషత్తు

### వివిధరాష్ట్రాల భాషావేత్తల సభానిర్ణయం

ఢిల్లీ, నవంబరు 23: భారతరాష్ట్రభాష హిందీని ప్రజానుమతంగా దిద్దే నిమిత్తం అఖిలభారతీయ హిందీ పరిషత్తునువిర్పాటు చేయాలని ఇచ్చట సమావేశమైన హిందీ భాషావేత్తలు నిర్ణయించారు.

ఈ సమావేశానికి డా॥ రాజేన్‌బాబు అధ్యక్షతవహించారు. మద్రాసు, బొంబాయి, [illegible]

[illegible]

సంలో అన్నారు.

అందుకు ఆయన ఈ క్రింది సూచనలు చేశారు:

(1) హిందీ వ్యాకరణాన్ని సవరించాలి. (2) దేశం సర్వసామాన్యంగా అంతా వాడుతూవున్న పదభాషా పదాలను హిందీలో చేర్చాలి. (3) హిందీ [illegible]

[illegible]

## నైజాం కాంగ్రెసు అధ్యక్ష ఎన్నికలు వాయిదా

హైదరాబాద్, నవంబరు 23: లోగడ నిర్ణయింపబడిన ప్రకారం, నవంబరు 30-వ జరుగవలసిన హైదరాబాద్ సంస్థాన కాంగ్రెస్ సంఘ అధ్యక్ష ఎన్నికలు వాయిదా పడినవి.

ఈ విషయాన్ని ప్రకటిస్తూ, సంస్థాన కాంగ్రెస్ అధ్యక్షులు స్వామిరామానంద తీర్థ ఉత్తరువుల ప్రకారం, అఖిల హైదరాబాద్ కాంగ్రెస్ సంఘ ఎన్నికలు, అధ్యక్ష పదవికి పోటీచేయు అభ్యర్థులు నామినేషన్లు ఉపసంహరించుకొనే తేదీ, సంఘ సభ్యులు నామినేషన్లు ఉపసంహరించుకొనే తేదీ కూడ వాయిదా వేయబడినవని హైదరాబాద్ కాంగ్రెస్ ప్రధాన కార్యదర్శి జె. కె. ప్రాణేశాచార్య గారన్నారు. త్వరలో సంస్థాన కాంగ్రెస్ కార్యవర్గం సమావేశమై ఇంకా ఎన్నికలు ఎప్పుడు జరుగవలసిందీ నిర్ణయించునని తెలియజేశారు.

కాంగ్రెస్‌లోని ఉభయపక్ష నాయకుల మధ్య రాజీ సంప్రదింపులు జరుగుతుండటంవల్ల, అధ్యక్ష ఎన్నికలు వాయిదా వేయబడినవని తెలుస్తున్నది.

## అప్రెంటిసులు కావలెను

బెజవాడ మునిసిపల్ సరిహద్దులలో యున్న పటమట గ్రామమున గల మా ఫ్యాక్టరిలో యిత్తడిని కరిగించి పోతపోయుట, ఫైలింగు, పాలిషింగు, యెలెక్ట్రో ప్లేటింగు మొదలుగాగల వివిధశాఖలలో ఆర్పిదు పొందుటకు ఉత్సాహముకల యువకులు ఈ ప్రకార వేతనముపై అప్రెంటిసులుగా తీసికొనబడుదురు. అనుభవముకల్గిన యింజనీయర్లు, యిన్‌స్ట్రక్టర్లచే క్రమశిక్షణ యొసగబడును. పిమ్మట యోగ్యతలను బట్టి వీరికి ఖాయముగా ఫ్యాక్టరిలో ఉద్యోగము లొసగబడును. కొలది ఖాళీలుమాత్రమే కలవు. వెంటనే ఈ క్రిందివారికి దరఖాస్తులు పంపవలెను.

## హోండిల్సు అమ్మకమునకు

ఆకర్షణీయముగా నికెల్‌ప్లేటింగు చేయబడిన యిత్తడిపోత గడియలు, హాండిల్సు బందులు మొదలుగాగల గృహనిర్మాణ వస్తువులు మంచి పనితనముతో పలురకములను నమూనాలలోను, సైజులలోను అమ్మకమునకు సిద్ధముగా నున్నవి. యినుప పెట్టెలు, బస్తీలు చేయు పారిశ్రామికులకు, వారు కోరిన నమూనాలలో పై వస్తువులను తయారుచేసి యివ్వగలము. వివిధరకములగు యిత్తడిపోత స్టాండులు, గరిటెలు కూడ అమ్మకమునకు సిద్ధముగా నున్నవి. వివరములకు:

కాజ వెంకట సూర్యప్రకాశరావు, బి. ఏ.,
మేనేజింగు డైరెక్టరు,
ది బెజవాడ మెటల్ అండ్ స్టీల్ యిండస్ట్రీస్ లిమిటెడ్.
సూర్యారావుపేట, బకింగుహాంపేట పోస్టు, బెజవాడ.

గుండె మంటయా?

.........ఏం చేయాలో చెబుతాను.

అవును. ఈజబ్బు

ఎంత బాధాకరమో నాకు తెలుసు. అవి కడుపు అధికామ్లమువల్ల కలుగుటా వుంటవి—మీ కడుపులో ఆమ్లము ఉండవలసిన దానికన్న అధికంగా వుంటుంది. అప్పుడు భోజనానంతరం దుర్బాధ, అజీర్ణపు నొప్పులు కలుగును. అమ్లమును హరించి మాములు జీర్ణక్రియనిచ్చునదిగా ప్రపంచమంతటా పేరొందిన 'బిస్మాగ్'ను శిఫారసు చేస్తున్నాను. బిస్మాగ్ మూడు నిముషాల్లో శమనం చేకూర్చును.

మీకు కావలసినది బిస్మాగ్

పొడుగాను, బిళ్ళలగాను, అందరు కెమిస్టులవద్దను స్టోరులలోను దొరకును.

BISMAG

ఇండియాకు సోల్ డిస్ట్రిబ్యూటర్లు:
జాఫే మానర్సు & కో., లిమిటెడ్.,
బొంబాయి - కలకత్తా - ఢిల్లీ - మద్రాసు.

డక్ బాక్

బెంగాల్ వాటర్ ప్రూఫ్
వర్క్సు (1940) లిమిటెడ్
కలకత్తా, బొంబాయి, నాగపూర్

మీ దగ్గును లిక్విఫ్రూటాతో పోగొట్టండి

లిక్విఫ్రూటా


# గ్రామములలో వేయి గాంధి కుటీరముల నిర్మాణము

## గాంధిజాతీయ స్మారకనిధి ధర్మకర్తల సంకల్పము

న్యూఢిల్లీ, నవంబరు 23: గ్రామమున కొక్కటిచొప్పున వేయి గాంధి కుటీరములను నిర్మింప గాంధి జాతీయ స్మారకనిధి ధర్మకర్తృత్వ సంఘమువారు సంకల్పించుచున్నారు. ఈ సూచనను ప్రధాని పండిత నెహ్రూగారు గావించిరి. ధర్మకర్తృత్వ సంఘమువారు ఆయన సూచనను అంగీకరించిరి. నిధి వివిధ ఉపసంఘములచే ఈ సూచన పరిశీలించబడినది. ఈ సూచనను అమలు చేయుటకు తుది పథకములు తయారగుచున్నవి. ప్రతి కుటీరములోను ప్రాథమిక విద్యా కేంద్రము, గ్రామ పంచాయతీ యుండును. ఈ గ్రామ పంచాయతీ గాంధి మహాత్ముని నిర్మాణ కార్యక్రమమును కొనసాగించును. ఈ సంస్థ నిర్మాణ కార్యక్రమ వర్కర్లను గూడ తర్ఫీదు చేయును ఈ కుటీరములకు మాత్రము 60 లక్షల రూపాయలు ఖర్చగునని అంచనా వేయుచున్నారు.

# ముందు ఏప్రెల్‌లో కాంగ్రెస్ మహాసభ

న్యూఢిల్లీ, నవంబర్ 22: కాంగ్రెసు కార్యవర్గం యీ మధ్య జరిపిన సమావేశంలో 56వ కాంగ్రెసు మహాసభ వచ్చే ఏప్రెలులో జరపాలని నిర్ణయించిందని తెలుస్తున్నది.

అయితే ఇది యెక్కడ జరిగేదీ ఇంకా నిర్ణయించలేదు. తమిళ, కేరళ, కర్ణాటక రాష్ట్రాలు యీ సమావేశం తమ రాష్ట్రాలలో జరపవలసిందని ఆహ్వానించాయట.

కేరళంలో యెప్పుడూ కాంగ్రెసు సభ జరగలేదనీ, అందుచేత కేరళ రాష్ట్రంలో ఇది తప్పక జరపాలనీ కేరళులు కోరారట.

# గుంటూరు న్యాయవాదుల సంఘ రజతోత్సవం

## మంత్రి మాధవమీనన్‌గారి అధ్యక్షోపన్యాసం

గుంటూరు, నవంబరు 21:— "ప్రతివారూ గాంధీజీని కీర్తించేవారే. గాంధీజీ వ్యక్తిత్వమును, ఆయన సిద్ధాంతాలను స్తుతించేవారే. అయినా ఒక్కరూ ఆయనను అనుసరించటానికి సిద్ధపడరు. గాంధీజీకి అతిముఖ్యమైన చరఖా కార్యక్రమానికి వ్యతిరేకించే మిల్లు యజమానులు, దరిద్ర ప్రజానీకపు రక్తాన్ని పీల్చి పిప్పి చేసే స్వార్థపరులూ, బ్లాక్ మార్కెట్ వ్యాపారంలో కోటీశ్వరులైనవారూ, ప్రతివారూ గాంధీజీమూర్తి చిత్రాన్ని పూజించేవారే. ఇది విధి పరిహాసం గాక మరేమిటి?" అని మద్రాసు న్యాయశాఖా మంత్రి కె. మాధవమీనన్ గారు గుంటూరు జిల్లా కోర్టులో మహాత్మాగాంధీ చిత్రము నావిష్కరిస్తూ అన్నారు.

గుంటూరు న్యాయవాదుల సంఘము నిన్న నిక్కడ తమ రజతోత్సవం జరిపారు. మంత్రి మాధవమీనన్ అధ్యక్షత వహించారు. జిల్లా జడ్జి, కలెక్టరు, మున్సిఫ్‌లు, చిన్న జడ్జీలు, హాజరయ్యారు. జిల్లాలోని న్యాయవాదులందరినీ మంత్రిగారు పరిచయం చేసుకున్నారు.

న్యాయవాదుల సంఘంవారు ఉదయం మంత్రిగారి గౌరవార్థమై పెద్ద విందు ఏర్పాటు చేశారు. సంఘంవారు సమర్పించిన స్వాగతపత్రానికి సమాధానమిస్తూ మంత్రిగారిలా అన్నారు.

"గుంటూరు న్యాయవాదుల సామర్థ్యం నాకు బాగా తెలుసు. వారి నాయకులందరూ నాకు సుపరిచితులు. కీ॥ శే॥ దేశభక్త వెంకటప్పయ్య, సర్దార్ గొల్లపూడి సీతారామశాస్త్రి, ఉన్నవ లక్ష్మీనారాయణగార్లు అందరూ నాకు నాయకుల వంటివారు. కీ॥ శే॥ జేపా, చాల చిత్రమైన మనిషి. నడింపల్లి నరసింహారావుగారు కూడా నాకు బాగా పరిచితులు. గుంటూరు పట్టణం న్యాయనిర్వహణ శాఖకే గాక శాసనసభకు కూడా యెందరో సభ్యులను, ప్రతిభావంతులను చేకూర్చింది. సలాం అటువంటివారు. నరసరావుపేటకు చెందిన కె. బ్రహ్మానందరెడ్డి అటువంటి మరొకరు."

కాంగ్రెసుపై జరిగే విమర్శలను ఖండిస్తూ మంత్రిగారిల్లా అన్నారు.

"న్యాయవాదులు దేశంలో వెనకబడి పెట్టి వేయబడుతున్నారు. 20 ఏళ్ళక్రిందట దేశాన్నంతా ముందుకు నడిపించినది న్యాయవాదులే. ఓట్లతో సహా ప్రతి విషయంలోనూ వారిదే ప్రథమ తాంబూలం. కాని నేడు వారికి పలుకుబడిలేదు, గౌరవంలేదు. న్యాయవాది యెవరైనా ఓట్ల కోసం ప్రచారంచేస్తే "మీరు వాదించే కేసులకు ఎల్లాగూ డబ్బిచ్చుకుంటున్నాము ఈ ఓటు మాది. మా యిష్టం వచ్చినట్లు దాన్ని ఉపయోగిస్తాము. అంటున్నారు ఓటర్లు. ఈపరిస్థితిని గమనించి న్యాయవాదులు తమ కోర్టు 4 గోడల మధ్యనే కాక, బయటి ప్రపంచంలోకి దృష్టి సారించి తమ ప్రతిభకు తగ్గపాత్రను నిర్వహించాలి."

స్వాగత పత్రంలో కోరబడిన కోర్టు సదుపాయాల విషయం ఆలోచిస్తానని చెబుతూ, ముందు విద్యుత్ దీపం కొలనేర్పాటు చేయించగలననీ, అయితే ప్రావిడెంటు ఫండు మున్నగు సౌకర్యాలు ప్రస్తుతానికి సాధ్యపడవనీ మంత్రిగారు చెప్పారు.

రజతోత్సవసభ ప్రార్థనతో ప్రారంభమైన తర్వాత ప్రముఖులనుండి వచ్చినశుభాకాంక్షలను సంఘ కార్యదర్శి జి. వి. రామమోహనరావుగారు చదివి వినిపించారు. చీఫ్‌జస్టిస్ పి. వి. రాజమన్నార్, జస్టిస్ చింతగుంట రాఘవరావు, ఇంకా ఎందరో ప్రముఖ న్యాయవాదులు సందేశాలు పంపారు.

సంఘాధ్యక్షులు ఎమ్. హనుమంతరావుగారు తమ స్వాగతపత్రంలో గుంటూరు న్యాయవాదుల సంఘ పుట్టుపూర్వోత్తరాలు వివరించారు.

"ఈసంఘం జన్మించినది 3-5-1924న. మొదట్లో 45 గురు సభ్యులతో ప్రారంభమై సంఖ్య 130 వరకూ పెరిగింది. గడచిన పాతిక సంవత్సరాల్లోను సంఘసభ్యుల్లో 15గురు ఒకరివెనుక ఒకరుగా అధ్యక్షులయ్యారు. వీరిలో కొందరిని మనం కోల్పోయాము. కొందరు రిటైరయ్యారు. మరికొందరింకా వృత్తిలోనే వున్నారు. కె. ఎస్. కృష్ణరావు పంతులు కె. కోటిలింగం పంతులు, ఎస్. వేపా కీర్తిశేషులయ్యారు, ఆర్. ఎల్. సోమయాజి, ఎ. ఎల్. నరసింహం, ఎమ్. వి. నరసింహాచారిగార్లు విశ్రాంతిలో వున్నారు. తక్కినవారు ఇప్పటికీ న్యాయవాదులుగా పని చేస్తున్నారు.

మరి కొందరుసంఘసభ్యులు అతిక్లిష్టమైన కార్యదర్శి పదవిని నిర్వహించారు. వీరందరినీ నేనీ శుభసమయంలో అభినందిస్తున్నాను. అయితే మా ప్రధాన నాయకుడైన జి. వి. శ్రీనివాసరావు పంతులును ఈ సమయంలో ప్రస్తావించటం నాముఖ్య విధి. ఆయన "షో" అంటే చాలు, ఈ సంఘానికి పదవివారిదే. అయినా వారు దీనిని నిరాకరించి విశ్రాంతిలో వుంటున్నారు. వారి త్యాగపరతకు నా ధన్యవాదాలు.

ఈసంఘం ఆదినుండీ స్వతంత్రభావాలతోనే నడిచింది. ఎన్నోసార్లు బ్రిటిష్ నిరంకుశత్వాన్ని తీవ్రంగా ఖండించింది. ఎందరో స్వాతంత్ర్యోద్యమంలో పాల్గొని పోరాడారు. శిక్షలు అనుభవించారు. ఇట్టివారిలో దేశభక్త కొండా, గొల్లపూడి, ఉన్నవ, ఎస్. వి. ఎల్. నరసింహారావు, ఎమ్. వి. కృష్ణమాచారి, ఎ. వి. నరసింహారావు, జి. వి. చౌదరి, కె. వి. సుందరరావు, ఎస్. వి. ఎల్. నరసింహం, ని. రామిరెడ్డి ఇంకా ఎందరో ప్రముఖులున్నారు. వీరందరినీ గౌరవపూర్వకంగా అభినందిస్తున్నాను.

ఈ సంఘం గత పాతికేళ్ళలోనూ న్యాయమూర్తులతోను, అధికారులతోను మర్యాదపూర్వక సంబంధాలనే కలిగి వుంది. అయితే కొన్ని సంవత్సరాలుగా న్యాయాధికారులు చాలమంది న్యాయవాదులకంటె తామే ఎక్కువవారమనీ, తమను న్యాయవాదులు గౌరవించాలనీ, తాము న్యాయవాదులనుగాని, ప్రజలనుగాని మన్నించనక్కరలేదని భావిస్తున్నట్లు మా సంఘంలో ఒక నమ్మకం ప్రబలింది. కొన్నిచోట్ల న్యాయాధికారుల అమర్యాద, వారు కలుగజేసే ఇబ్బందులు ఈ సంఘం వారికి కోపకారణం కూడా అయినవి. ముందు ముందు ఈ పరిస్థితులు మారునని ఉభయులకు స్నేహసంబంధాలేర్పడ గలవని ఆశిస్తున్నాను."

# నైరుతి ఆఫ్రికాపై తన వాదనను విన మనిసమితికి మైకల్ స్కాట్ విజ్ఞాపన

## దక్షిణాఫ్రికా ప్రతినిధి ప్రాతికూల్యం: భారతప్రతినిధి సవరణ ప్రతిపాదన

లేక్‌సక్సెస్, నవంబరు 22: హెర్రో జాతిప్రతినిధిగా మైకేల్ స్కాట్ విజ్ఞాపనాన్ని వినడాన్నిగూర్చి వచ్చిన కాగితాలన్నింటిని పరిశీలించవలసిన అవసరాన్నిగూర్చి క్యూబా ప్రతినిధి ధర్మకర్తృత్వసంఘంలో ఒక ప్రతిపాదన తెచ్చారు.

ఈ ప్రతిపాదనకు ఇండియా ఒకసవరణను సూచిస్తూ, మైకేల్ స్కాట్ పెట్టుకొన్న అర్జీలోను, పంపుకున్న కాగితాలలోను, ఆయన అజాతికి ప్రాతినిధ్యం వహిస్తాడా? వహించడా అనే విషయానికి సంబంధించి వాటిని సభ్యులందరికీ అందజేయాలి అని కోరింది.

శ్రీ బి. శివరావు ఇండియాతరఫున ఈ సవరణను ప్రతిపాదించగా 28 మంది అనుకూలంగా ఓటు చేశారు. 6 గురుమాత్రం వ్యతిరేకంగా ఓటుచేశారు. 9 మంది తటస్థంగా వూరుకున్నారు.

ఇండియా తనవిషయంలో చేస్తున్న కృషిని రివరెండ్ స్కాట్‌వాడ్తిస్తూ, ఇందువల్ల ప్రపంచరాజకీయాలలో ఇండియాకు గలప్రాముఖ్యం వెల్లడిఅవుతున్నదన్నారు.

నైఋతి ఆఫ్రికా విషయాలనుగూర్చి మైకేల్‌స్కాట్‌కు ధర్మకర్తృత్వ సంఘంలో మాట్లాడే సావకాశం కల్పించాలా అక్కరలేదా అన్న విషయం చర్చకు రావడంలో సమితి ఒక విచిత్రమైన చిక్కులో పడిపోయింది. ఆయన అర్జీని అంగీకరిస్తే, అందువల్ల ఒక కొత్త సంప్రదాయాన్ని ఏర్పాటు చేసినట్లయిపోతుంది.

నైఋతి ఆఫ్రికాను గూర్చిన విన్నపాలను ధర్మకర్తృత్వ సంఘానికి నివేదించుకోవలసిన అవసరం లేనేలేదని దక్షిణ ఆఫ్రికావాదిస్తున్నది. దీనిమీద చర్చ రెండు రోజులనుంచి యథాప్రకారంగా సాగుతోందిగాని, నేను క్యూబా ప్రతినిధి మాట్లాడుదూ, మాట్లాడుతూ, మైకేల్ స్కాట్ అర్జీనిగూర్చిన ప్రసక్తి తీసుకురావడంతో చర్చ విచిత్రంగా మారిపోయింది.

మైకేల్ స్కాట్ పెట్టుకొన్న అర్జీనిగూర్చి సంఘంవారు ఏమిచేయదలచుకున్నారో తెలియవలసి వుంది. ఈ విషయంలో సంఘాధ్యక్షుల అభిప్రాయం తెలుసుకోవాలనివుంది. ఆ అర్జీని సమితిముందుకు తెచ్చేందుకు ఏమి ప్రయత్నం జరుగుతున్నదో కూడా నేను తెలుసుకోవాలనుకుంటున్నాను, అని క్యూబా ప్రతినిధి అన్నారు;

అప్పుడు దక్షిణ ఆఫ్రికా ప్రతినిధి జూస్టే స్కాట్ చెప్పేవిషయాలను వినాలన్న ప్రతిపాదన ఏమన్నా వుందా అని ప్రశ్నించారు. అటువంటిదేమీ లేదని తేలిన తరువాత రివరెండ్ స్కాట్ నైఋతి ఆఫ్రికా విషయంలో ఇచ్చట మాట్లాడటానికి వీలులేదని జూస్టే అన్నారు. నైఋతి ఆఫ్రికాలో హెర్రోలు అట్టే మందికాదు. వారిలో 100కి 40 మంది బచూనాలాండులో వుంటున్నారు. తక్కినవ అందరిని కలుపుకున్నా నైఋతి ఆఫ్రికా జనాభాలో పదోవంతు వుండరు, అని ఆయన అన్నారు.

అయినా అట్లా దేశీయప్రజా వర్గాల అభిప్రాయాలను వినాలని గ్వాటమాలావారు ఒకసూచనచేసారు. దాన్నిగూర్చి మాట్లాడుతూ, ప్రతిదేశంలో ప్రభుత్వ ప్రతివర్గాలవారు వుంటూ వుంటారనీ, వారితరఫున మాట్లాడుతామని వచ్చిన ప్రతినిధుల తాహతు ఏమిటి అని విచారిస్తే, దాంట్లోవున్న బండారం బయట పడిపోతుందని జూస్టే అన్నారు.

అంతట కార్యక్రమాంశాన్ని లేవదీసి, శ్రీ బి. శివరావు కల్పించుకొని, ప్రస్తుతం సంఘంవారు గ్వాటమేలా ప్రతిపాదనను గూర్చి చర్చిస్తున్నారని, వారు ఒక్కరే నైఋతి ఆఫ్రికా విషయంలో దేశీయ ప్రజానీక ప్రతినిధులు చెప్పేదాన్నిగూడ వినాలని కోరుతున్నారని అందువల్ల ప్రస్తుతం జూస్టే మాట్లాడింది, వారి తీర్మానం సెగ్గి, వారుకోరినప్రకారం ఒక ప్రత్యేక సంఘం ఏర్పాటైతే, అచ్చటగాని, లేకపోతే, అట్లా దేశీయ ప్రజా ప్రతినిధులను వినవచ్చునని సమస్త కర్తృత్వసంఘం నిశ్చయిస్తే అప్పుడుగాని మాటాడిగే బాగుంటుందిగాని యిప్పుడు అప్రస్తుతంగా వుంటుందని అన్నారు.

అనికాకుండా గ్వాటమేలా ప్రతిపాదనలో సభాపాలురు ఆ ప్రతినిధులని పేర్కొనలేదు. కాబట్టి మనం చర్చలో ఆ ప్రతిపాదనలోలేని విషయాలనుగూర్చి చర్చించడం బాగుండదేమో గూడా అని ఆయన హెచ్చరిస్తూ, ఇప్పుడు ఏ వ్యక్తులనుగూర్చి, ఏ సంస్థలనుగూర్చి మాట్లాడమన్నామో, అర్జీపట్ల, జనసంస్థలను తెలిసిన మీదట ఏదైనాయిచ్చే సావకాశం లేనప్పుడు అటువంటి ప్రసంగాలు చేయడం అనవసరమనిగూడా ఆయన హెచ్చరించారు.

తరువాత కార్యనిర్వహణ విధానాలు గూర్చి కొంత చర్చ జరిగింది.

సంఘం తిరిగి రేపు సమావేశమౌతుంది.

# కామన్వెల్తు విదేశాంగ మంత్రులసభ

## బ్రిటిష్ ప్రతినిధివర్గానికి బెవిన్‌నాయకత్వం

### భారతప్రధాని హాజరయ్యేసూచన

భారతప్రధాని హాజరయ్యే సూచన

లండన్, నవంబర్ 22: సింహళంలో జరుగనున్న కామన్వెల్తు విదేశాంగమంత్రులసభకు వెళ్ళే బ్రిటిష్‌ప్రతినిధివర్గ సభ్యులపేర్లు త్వరలో ప్రకటితంకావచ్చునని తెలుస్తున్నది. బ్రిటిష్ ప్రతినిధివర్గానికి ఎర్నెస్టు బెవిన్ నాయకత్వం వహించాలనుకొంటున్నారు. ఈ ప్రతినిధివర్గంలో ఫిలిప్ నోయెల్ బేకర్‌గూడా పాల్గొనవచ్చు.

విదేశాంగమంత్రుల సభ 1950 జనవరి మొదటివారంలో ప్రారంభమై 10 రోజులు జరుగవచ్చునని అనుకొంటున్నారు.

బ్రిటిష్ ప్రతినిధివర్గం తొలూరు వారైనా జనవరి 26-న భారత రిపబ్లిక్ అవతరణోత్సవములలో పాల్గొనేందుకు ఢిల్లీకి వెడతారో లేదో తెలియరాలేదు.

జనవరిలో భారతదేశం రావలసిందిగా, బ్రిటిష్ ఆరోగ్యశాఖా మంత్రికి భారత ప్రభుత్వం ఆహ్వానంపంపిందిగనుక, ఆయన మాత్రం భారతరిపబ్లిక్ అవతరణోత్సవాలలో పాల్గొంటాడని చెప్పవచ్చు.

జనవరి 9 సమావేశమైతే తాను హాజరు కాగలనని భారతప్రధానమంత్రి సేనానాయకే గార్కి వ్రాసినట్లు తెలుస్తున్నది.

# అన్ని తరగతుల రైల్వే ఉద్యోగులకు ప్రావిడెంటుఫండు

## రవాణాశాఖమంత్రి ప్రకటన

న్యూఢిల్లీ, నవంబరు 22: ప్రభుత్వ రైల్వేప్రావిడెంటుఫండుకు యింతవరకు ఐచ్ఛికముగా చందాయిచ్చుచున్న అన్ని తరగతుల రైల్వేపనివారును యిప్పుడు ప్రావిడెంటు ఫండుకు నిర్బంధముగా ద్రవ్యము చెల్లింపవలసియుందురు.

అ. భా. రైల్వేఫెడరేషను అధ్యక్షుడగు శ్రీ జయప్రకాశ్ నారాయణ్ గారిని ఇంకా ఫెడరేషను కార్యవర్గసభ్యులను 7 గురిని నేడు రవాణాశాఖమంత్రి శ్రీ గోపాలస్వామి అయ్యంగారు కలిసికొని చర్చలుజరిపినప్పుడు యీ విషయమును అయ్యంగారు ప్రకటించెను. రాకపోకల శాఖమంత్రి శ్రీ కె. ఎస్. సంతానంగారు గూడ సభలో నుండిరి.

ఈ క్రొత్తసౌకర్యమువల్ల రైల్వేకర్మాగారములయందలి పనివారును, నాల్గవతరగతి పనివారును లాభపడుదురు. పనివారికి ఈ సౌకర్యము కల్పించినందువల్ల ప్రభుత్వమువారికి ప్రతిసంవత్సరము ఒకకోటి రూపాయలు వ్యయమగును.

ఈ సంవత్సర ప్రారంభమున రైల్వే ఫెడరేషనువారు మంత్రినికలిసికొని చర్చలు జరిపినప్పుడు ఫెడరేషనువారు గావించియుండిన సూచనలపై ప్రభుత్వ పరిశీలన యెంతవరకు సాగినది, ఎన్ని విషయములపైవారు నిర్ణయములు చేయగలిగిరి? అను విషయములను నేడు సభవారు సింహావలోకనము గావించిరి. దాదాపు అన్ని సూచనలపైనను పరిశీలన పూర్తియై తుది ఉత్తర్వులు జారీచేయబడెను. ఇంకా మిగిలియున్న 2, 3 సూచనలపై యింకను చర్చజరిగెను.

సమష్టిసలహా సంఘము యెట్లు పనిచేయుచున్నదీ సభవారు పరిశీలించిరి. జీతాల కమిషను సంఘాలను అమలుచేయుటవల్ల ఉత్పన్నమగు వైపరీత్యములను విచారించుటకై కొన్ని మాసముల క్రిందట యీ సలహాసంఘమును ప్రభుత్వమువారు యేర్పరచియుండిరి. ఈసంఘముగావించిన సలహాలను, ప్రభుత్వమువారు అప్పుడప్పుడు గావించిన ఉత్తర్వులను ప్రచురించుటకు మంత్రి అంగీకరించెను. రేపు మంత్రులు శ్రీ జయప్రకాశ్ నారాయణ్ గారితో యింకను చర్చలు జరిపెదరు.

# భారత సహాయానికి లిబియా ప్రతినిధి కృతజ్ఞత

లేక్‌సక్సెస్, నవంబరు 22: లిబియా అనధికార ప్రతినిధి వర్గానికి నాయకుడు, ట్రిపోలిటానా నేషనల్ కాంగ్రెస్ అధ్యక్షులు అయిన బషీరుసేదవాలీ ఈ వేళ మొట్టమొదటగా ఇటలీ కాలనీల విషయంలో ఇండియా ప్రతినిధి చేసిన సహాయానికి తమ కృతజ్ఞత వెల్లడించారు. లిబియా స్వాతంత్ర్యం విషయంలో సర్ బెనిగాల్ నరసింగరావు చేసిన సహాయాన్ని ఆయన ప్రత్యేకంగా ప్రశంసించారు.

ఆ పిమ్మట కొంతమంది అరబ్ నాయకులు తమ కృతజ్ఞతను ఒక ప్రత్యేక లేఖ ద్వారా పండిట్ నెహ్రూకు తెలియజేస్తామని అన్నారు.


గోద్రెజ్ వత్ని టాయిలెట్ సబ్బులు

Godrej రిజిష్టర్డు Vatni యింకా చిన్న (బేబి) సైజు
(మాతృభూమియొక్క)

యితర రకపు సబ్బులు యివ్వలేని గుణములు యీ సబ్బుయందు కలవు. యీ శుద్ధమైన ఆకు పచ్చని సబ్బు, ఈ రోజుననే వాడి—ఆనందించండి—దీని సువాసన చివరవరకు వుంటుంది—పసి బిడ్డల చర్మములకు కూడా, శాంతిని, పరిశుభ్రతను, అందమును యిచ్చి, 'టానిక్' వలె పని చేయును.

6 అణాలు

అది సాటిలేని విలువగల స్వదేశీ సబ్బు

మరికొన్ని ప్రసిద్ధమైన గోద్రెజ్ సబ్బులు
నెం. 1.—నెం. 2.—శాండల్—రిండా (షేవ)
ఐన్—షేవింగ్ స్టిక్—షేవింగ్ 'రౌండ్'
యింకా, గ్లిసరిన్, తలనూనె.

నూటికి నూరుపాళ్ల పరిశుద్ధమైన దనియు, జంతువుల క్రొవ్వు చేరలేదనియు, గ్యారంటీ యివ్వబడియున్నది.

గోద్రెజ్ సోప్సు, లిమిటెడ్,
మద్రాసు: 164, బ్రాడ్వే.

సుఖము నిచ్చుటలో కాట్స్‌వాల్‌కు మించిన గుడ్డలేదు

పిల్లలకు పెద్దలకు అన్ని ఋతువులలో ధరించుటకు తగినది.

మీ బట్టల దుకాణములో ఇప్పుడే కాట్స్‌వాల్‌ను చూడుము!

ఉతుకుటకు సూడ బట్టలను మాదిరి బట్టలను ...తో లక సబ్బు ముక్కలతో గోరువెచ్చని నీరు వాడి ఉతకవలెను.

ది బెంగుళూర్ వులెన్, కాటన్ అండ్ సిల్క్ మిల్స్, కం., లి. బెంగుళూరు సిటీ.
ఏజంట్లు, కార్యదర్శులు, కోశాధిపతులు:
బిన్నీ & కంపెనీ (మద్రాసు) లిమిటెడ్,

Cotswol

తయారు చేయువారు:
ది. బెంగుళూరు మిల్స్
మరియొక ప్రఖ్యాతిసందిన గొర్రె మార్కు గుడ్డ.

హెచ్. ఏ. అర్. మహమ్మద్ సేట్ అండ్ సన్సు, చిక్‌పేట, బెంగుళూరు సిటీ.
హెచ్. ఏ. అర్. మహమ్మద్ అండ్ సన్సు, 6 గోడౌన్‌వీధి, మద్రాసు.
హాజీయిబ్రాహిం యిసాక్ అండ్ సన్సు, చిక్‌పేట, బెంగుళూరు సిటీ.
రాం నారాయణ గిర్ధరిదాస్ అండ్ కో, దొడ్‌పేట, బెంగుళూరు సిటీ.
మద్రాసు మిల్సు ట్రేడింగ్ కంపెనీ, సాండర్సురోడ్డు, సికింద్రాబాద్ (దక్కన్)

మీరు నమ్మతగినవి
Ajax అజాక్స్

అజాక్స్ ప్రోడక్ట్స్ లిమిటెడ్


# శ్రీమద్భగవద్గీత

(వ్యాఖ్యాత: శ్రీ కోలాచలము శ్రీనివాసరావుగారు)

పంచమ ముద్రణము: వెల రూ. 4-0-0

మేనేజరు, ఆంధ్రగ్రంథమాల
7, రంగుశెట్టి వీధి, జి. టి. మద్రాసు.

## రేడియో ప్రోగ్రాములు

నవంబరు 26 శనివారం

### మద్రాసు (ఏ)

ఉ. 7-30 ఆర్. జానకి పాట. 8-0 ఆంగ్లమున వార్తలు. 8-15 ఉదయసంగీతం. (రి) 8-30 మద్రాసు (బి) వలె. మ. 1-0 మద్రాసు (బి) వలె. 1-30 ఆంగ్లమున వార్తలు. 1-40 సినిమా సంగీతం (రి) 4-0 పిల్లల కార్యక్రమం. ఆంగ్లమున 4-30 పాశ్చాత్య సంగీతం (రి) సా 5-30 ఆర్. ఎస్. రంగప్ప వీణ. 6-0 ఆంగ్లమున వార్తలు. 6-20 టి. ఎస్. త్యాగరాజన్ పాట. 7-0 ఎన్. కళ్యాణి వయొలిన్ 7-30 గీతమంజరి (రి) 7-45 చింతై వైద్యనాథ భాగవతర్ పాట. 9-0 ఆంగ్లమున వార్తలు. 9-15 గ్రంథసమీక్ష. ఆంగ్లమున జె. ఆర్. మార్షెల్. 9-30 మద్రాసు (బి) వలె. 10-0 పాశ్చాత్య సంగీతం (రి)

### మద్రాసు (బి)

ఉ 7-0 తెలుగున వార్తలు. 7-15 ...

### విజయవాడ

...

### హైదరాబాదు

... 9-15 శేఖ ... 9-30 కృష్ణకేలాల్ ... 9-55 మాధవలాల్ సింఘ్ భజన్ 10-5 కృష్ణలాల్ ద్రా గీత్ 10-25 ... 10-35 ... 10-45 కృష్ణన్‌లాల్ ... ఘజల్.


## WANTED

AN IDEAL AND POPULAR GENERal Insurance Society of Madras transacting Fire and Motor Insurance (on Mutual Basis (i. e.) all the profits going back only to those that insure) invites applications from real workers capable of introducing substantial business to represent as Chief Agents on good commission or salary. Contact immediately Box No. 5225 C/o Andhra Patrika, Madras.

గనోక్యూర్
అన్నిసెగలకు గంటలలోగుణము
ఈశ్వరఫార్మసీ, రాజమండ్రి.


# "అనేక ఫెడరల్ రాజ్యాంగాలకంటే మనరాజ్యాంగం మెరుగు"

## తృతీయప్రతిపాదనపై పరిషత్ చర్చ: అల్లాడి కృష్ణస్వామి ప్రభృతుల ప్రశంసలు

న్యూఢిల్లీ, నవంబర్ 23: భారత రాజ్యాంగపరిషత్తు నేడు నూతనరాజ్యాంగ తృతీయ ప్రతిపాదనపై చర్చ జరుపుతున్నప్పుడు, రాజ్యాంగాన్ని సమర్థించేవారు ఎక్కువగా కనిపించారు.

అల్లాడి కృష్ణస్వామి అయ్యర్ గారు మాట్లాడుతూ నవభారత రాజ్యాంగం అనేక ఫెడరల్ దేశాల రాజ్యాంగాలకన్నా, అమెరికన్ రాజ్యాంగానికన్నా కూడా, మెరుగ్గావున్నదనీ, దేశంలో యెటువంటి ఆర్థికవ్యవస్థను నిర్మించదలచుకున్నా ఉపయోగించేటట్లు అన్వయ ... 

### కృష్ణస్వామి అయ్యర్ ప్రశంస

రాజ్యాంగ రచనా సంఘ సభ్యుడు అల్లాడి కృష్ణస్వామి అయ్యర్ గారు ఈ క్రింది విధంగా ప్రసంగించారు.

"రాజ్యాంగ స్థాపనాశయాలను వివరిస్తున్న సూత్రాన్ని, ఉపోద్ఘాతంలో చెప్పబడిన అంశాలనూ నూతన రాజ్యాంగం అన్నివిధాలా సఫలం చేస్తున్నది. ప్రజలలో అత్యధికసంఖ్యాకులు నిరక్షరాస్యులు, అజ్ఞానులు అయినప్పటికి పరిషత్తు వయోజనులు, అందరికి వోటింగ్ హక్కును ...

### పరిపాలనా సూత్రాలు

...

### కామన్వెల్తు సంబంధం

...

### లౌకిక ప్రభుత్వం

...

### అన్వయ సౌలభ్యం

...

### మతవర్గ ప్రాతినిధ్యాలు

...

### సమాన హక్కులు : అవకాశాలు

...

### సంస్థానాలు : యూనియన్

...

### కేంద్ర ప్రభుత్వాధికారాలు

...

### న్యాయశాఖ

...

... విభజించటం నిరంకుశంగా ఉన్నదనీ, బొంబాయిలో గుజరాతీ మాట్లాడే ప్రజలు 100 కి మూడు వంతులకన్నా లేరనీ అన్నారు.

నందకిశోర్ దాస్, సర్దార్ సోచేత్ సింగ్, టి. జె. ఎం. విల్సన్ సిద్ధవీరప్ప గోపీకృష్ణ విజయవర్గీయ మొదలైనవారు రాజ్యాంగాన్ని ప్రశంసిస్తూ మాట్లాడారు. పంచాయతీ రాజ్యాంగం ఉంటే సాధారణ ప్రజలు ప్రభుత్వంలో పాల్గొనే అవకాశం ఉంటుందని విల్సన్‌గారూ, 10 ఏళ్లవరకూ కేంద్రానికి సర్వాధికారం ఇవ్వక్కరలేదని సిద్ధవీరప్పగారూ అన్నారు.

### నిరుద్యోగ సమస్య

కమలాపతి త్రిపాఠీగారు మాట్లాడుతూ రాజ్యాంగంలో పౌరులందరికి పనిచూపించే హామీ ఏదీలేదని విమర్శించారు. పెద్ద ఉద్యోగుల జీతాలవిషయమై ఎక్కువ చర్చ జరిగినదికాని చిన్న ఉద్యోగులకు ...

## ఆస్ట్రేలియన్ పిండి ధరల పెంపకం

### వచ్చేకామన్‌వెల్తు సమావేశంలో చర్చ

...



# కాంగ్రెస్ అధ్యక్షుడు డాక్టర్ పట్టాభి సీతారామయ్యగారి 70వ జన్మదినం

## గవర్నర్ జనరల్ ప్రధానమంత్రి నెహ్రూ ప్రభృతుల శుభాకాంక్షలు

న్యూఢిల్లీ, నవంబరు 24: నేడు కాంగ్రెసు అధ్యక్షులు, డా॥ భోగరాజు పట్టాభి సీతారామయ్యగారు తమ 70-వ జన్మదినోత్సవం ప్రశాంతంగా జరుపుకున్నారు. ఎట్టి ప్రత్యేక ఉత్సవమూ జరుగలేదు.

నేటి ఉదయం అందరికన్నా ముందుగా రాజ్యాంగ పరిషదధ్యక్షులు డా॥ రాజేంద్రప్రసాదు డా॥ పట్టాభిగారి ఇంటికి వెళ్లి అభినందించి, చిరాయువుగా దీవించారు. అటుతరువాత అనేకమంది రాజ్యాంగ పరిషత్సభ్యులు, డా॥ పట్టాభి మిత్రులు, ఎన్. వి. గాడ్గిల్, టి. ప్రకాశం, డా॥ అలగప్ప చెట్టియారు మొదలైనవారు వచ్చి అభినందించారు.

డా. పట్టాభికి చిరాయువు ఆకాంక్షిస్తూ గవర్నరు జనరలు రాజగోపాలాచారి, ప్రధాని నెహ్రూ, వాణిజ్యమంత్రి నియోగీ, బొంబాయినుంచి బొంబాయి రాష్ట్ర కాంగ్రెసు అధ్యక్షుడు ఎస్. కే. పాటిల్ మొదలైనవారు సందేశాలు పంపారు.

# వెలుపోలుపై కమ్యూనిస్టుల దాడి కేసులో తీర్పు

## 50 మంది ముద్దాయిలను సెషన్సు విచారణకు పంపుట

(స్వకీయవిలేఖరి)

మచిలీపట్నం, నవంబరు 23: వెలుపోలుపైకమ్యూనిస్టులదాడి కేసును విచారించిన స్పెషల్ సెకండ్ క్లాసు మేజస్ట్రేటు జి. వి. చలపతిరావుగారు ముద్దాయిలు 50 మందిని సెషన్సుకు కమిట్ చేసిరి.

...

... ముద్దాయిల వాదనలు, తాము జరిగిందారుల ప్రతికూలపక్షమువారని, లోగడ జమీందారు పక్షమైన కోనేరు బసవయ్య వద్దైరా ప్రాసిక్యూషన్ సాక్షులకు తమపై కల వైమనస్యముతో తమందరిని ముద్దాయిలుగా చేర్చడమైనదని తెల్పుచున్నది. 5, 6, 8, 9, 11, 12, 13, 14, 15, 18, 19, 21, 23, 28, 30, 31, 32, 36, 37, 38, 39, 43, 44, 46, 47, 48, 49, 50, 55, 56, 57, 59, 73, 74, 75, 76, 77, 82, 83, 85, 92, 93, 94 ముద్దాయిలు నేరము జరిగినప్పుడు వెలుపోలులో లేమని వాదించిరి. ...

... 802 సెక్షన్ క్రింద, 5, 6, 8, 9, 17, 44 ముద్దాయిల మీదను, 307 సెక్షన్ క్రింద 9, 5 ముద్దాయిలమీదను, 324 సెక్షన్ క్రింద 5, 6, 8, 38, 81 ముద్దాయిల మీదను, 325 సెక్షన్ క్రింద 5, 9, 16, 17 ముద్దాయిలమీదను, 120 (బి) 149 సెక్షన్ల క్రింద అందరు ముద్దాయిలపైనను నేరములు మోపబడినవి. చచ్చిపోయిన వారు చచ్చిపోవుటకు కారణము ఘాతుక దెబ్బలు ఏముద్దాయి కొట్టినదీ రుజువు కాలేదు. కాని ఉద్దేశ్యము పని ఒకచేయుటచే చనిపోయినవారిని పొడిచిన ముద్దాయిలందరు పీనల్ కోడు 302 సెక్షన్ క్రింద శిక్షార్హులు కావున క్రిమినల్ ప్రొసీజరుకోడు 218 (1) సెక్షన్ క్రింద సెక్షన్ కోర్టులో విచారణకు 5, 6, 8, 9, 11, 19, 21, 23, 28, 30, 32, 34-39- 43, 50, 55-57, 59, 73-77, 80-83, 85, 92, 93, 94 ముద్దాయిలను కమిటు చేయడమైనది

# హిందూమహాసభ అధ్యక్షత

## సావర్కార్ నిరాకరణ

కలకత్తాలో జరుగనున్న హిందూమహాసభల సమావేశమునకు అధ్యక్షత వహించవలసిందిగా వి. డి. సవర్కార్ గారికి ఆహ్వానం అందజేశారు. అనారోగ్యకారణంగా తాను ఆ ఆహ్వానాన్ని అంగీకరించలేక పోతున్నానని సవర్కార్ తెలియజేశారు. ...

### తిరుమంగై యాళ్వార్ల బ్రహ్మోత్సవం

... తాలూకా తిరువాలి తిరునగరిలో తిరుమంగై యాళ్వార్ల బ్రహ్మోత్సవం నవంబరు 26 నుంచి డిశంబరు 4 వ తేదివరకు జరుగును. భక్తులు విచ్చేసి స్వామిని సేవించ ప్రార్థన.

## న్యూయార్కు దూది

న్యూయార్కు, నవంబరు 23:

డిశంబరు 29.90 / 29.91 మార్చి 29.96 / 29.96 మే 29.93 / 29.91 జూలై 29.60/29.61 అక్టోబర్ 28.10/ 28.12 డిశంబరు 28.06 / 28.06 మార్చి 27.97 / 27.97 మే 27.92/ జడ్ 27.94 ఆస్క్‌డ్.

| | | |
|---|---|---|
| మిడ్లింగ్ | బోజరు | 30.51 |
| డిశంబరు | (కనిష్ఠధర) | |
| | (కనిష్ఠ ధర) | |

డిసంబరు వాయిదా ధరలు

| | | | |
|---|---|---|---|
| నేటి | ప్రారంభం | జి. | 29.17 |
| | నిన్న | | 29.75 |
| ,, | ముగింపు | జిల | 29.90 |
| | నిన్న | | 29.87 |

## గంటల పంచాంగం

విరోధి సం॥ మార్గశిర శు॥ షష్ఠి

1949 సం॥ నవం॥ 25 శుక్రవారం

శు॥ షష్ఠి రా 2-0 శ్ర రా 4-17 వర్జ్యం ఉ 7-44 ల 9-23 కు.

శు॥ సప్తమి నవం॥ 26 శనివారం, శు॥ సప్తమి రా 2-51 ధని తె 5-43 వర్జ్యం ఉ8-32 ల 10-13 కు.




# ఆంధ్రపత్రిక

విరోధి సం॥ మార్గశిర శు॥ షష్ఠి

శుక్రవారం


## ఆంధ్రరాష్ట్ర తాత్కాలిక రాజధాని సమస్య

చెన్నపట్టణము ఆంధ్ర, తమిళ రాష్ట్రములకు రాజధానీ నగరముగ ఉండుటవలనను, నగరముపై ఉమ్మడి పరిపాలన యుండుటవలనను అనేక పరిపాలనా అసౌకర్యములు ఏర్పడునని రాష్ట్రపబ్లిక్ వర్క్సు మంత్రి శ్రీ యం. భక్తవత్సలంగారు బుధవారము పత్రికావిలేఖరులతో సంభాషించుచు వెల్లడించిన యభిప్రాయములు "వారి వ్యక్తిగతాభిప్రాయములు" అయినను, ఏర్పడనున్న ఆంధ్రరాష్ట్రము విషయములో తమిళుల వైఖరి ఎట్లున్నదో, ఎట్లుండునో ఊహించుటకు ఉపయోగపడగలవు. విభజన జరిగిన ఉత్తరక్షణమున ఆంధ్రులకు చెన్నపట్టణమున ఎట్టిస్థానము ఉండరాదని తమిళ నాయకులందరి యభిప్రాయము. అతఃపూర్వము "ఆంధ్రులు చెన్నపట్టణముపై తమ హక్కులను వదులుకొనిన ఆంధ్రరాష్ట్ర రాజధాని తాత్కాలికముగ చెన్నపట్టణమునందుండుటకు అభ్యంతరము లేదు" అని ప్రకటించుచు వచ్చిన తమిళనాయకులు హఠాత్తుగ తమ అభిప్రాయములను మార్చుకొని నగరమునుండి ఆంధ్ర ప్రభుత్వమును, విభజన జరిగిన వెంటనే సాగనంపుటకు కేంద్రప్రభుత్వము వద్దకు రాయబారములు జరుపుటకు "నగరము ప్రత్యేకరాష్ట్రము"గ ఏర్పడుటకు నగరమున తాత్కాలికముగ ఆంధ్రరాజధాని స్థాపన దోహదము చేయునను సందేహమే కారణమని భావింపవలసియుండును.

విభజన జరుగుటకు కొంత వ్యవధి కావలసియుండునని ప్రధాని శ్రీ కుమారస్వామి రాజాగారు ప్రకటించిరి. తిరిగి వాద ప్రతివాదములకు ఆస్కారములేక విభజన సవ్యముగ జరుగవలెనన్న భారత దేశ విభజనవలె రెండుమాసములలో ఈ కార్యక్రమమును పూర్తి చేయుట సాధ్యముగాదు. విభజన కలాపమునకు ఇంత వ్యవధి కావలసియున్న, క్రొత్తగ ఏర్పడు రాష్ట్రమునకు రాజధాని నిర్మాణమునకు ఎంతవ్యవధి కావలసియుండునో ఊహించుకొనవలసినదే. కొందరు ఉత్సాహవంతులు చెప్పినట్లు విభజన జరిగిన వెంటనే ఆంధ్రులు తమ ప్రభుత్వమును నూతన రాజధానికి తరలింపదలచినను, అట్టిది ఆచరణ సాధ్యము గాదు. కనుక తమిళ నాయకులకు ఎంత సమ్మతముగాకున్నను కొంత కాలమువరకు ఆంధ్ర ప్రభుత్వ స్థానము చెన్నపట్టణమున ఉండక తప్పదు.

ఇక మంత్రి భక్తవత్సలంగారు తెలిపిన పరిపాలన అసౌకర్యములు అధిగమింప సాధ్యముగానివి కావు. పబ్లిక్ వర్క్సుమంత్రి వ్యాఖ్యానమునుబట్టి "పోలీసుపరిపాలనకు సంబంధించి ఆంధ్ర తమిళ ప్రభుత్వములు భిన్న ఉత్తరువుల నిచ్చుటవలన గందరగోళ మేర్పడును". కాబట్టి పరిపాలన అసౌకర్యములు ఏర్పడునని వీరి యభిప్రాయమైనట్లు ఊహింపవలసి యున్నది. చెన్నపట్టణమునందు "లా అండ్ ఆర్డర్" రక్షణబాధ్యత నగరమునందున్న ఆంధ్రేతర ప్రభుత్వము చేతనై యుండును; లేక రాష్ట్రకాంగ్రెస్ సంఘము నవంబరు 11 వ తేదీ తీర్మానమునందు సూచించినట్లు నగరమునకు సంబంధించిన వ్యవహారములు ఇరు ప్రభుత్వముల "ఉమ్మడి నిర్ణయము" ప్రకారము నిర్వహింపబడవచ్చును. ఏవిధముగ చూచినను, నగరమున ఆంధ్ర ప్రభుత్వ కార్యస్థానము కొంత కాలమువరకు చెన్నపట్టణము నందుండుటకు అధిగమింప వీలుగాని అవరోధము లేమియు లేవు. కాని అట్టి ఏర్పాటు జరుగకుండ చేయుటకు జరుగు ప్రయత్నములను మాత్రము అరికట్టవలసియున్నది. కేంద్రప్రభుత్వముసాధ్యాసాధ్యము లన్నింటిని పరిశీలించి ఈ సమస్యను అందరికి సమ్మతముగ నుండునట్లు పరిష్కరింపవలెను.

## 'అణుశక్తిపై అంతర్జాతీయ ఆధిపత్యం వుండితీరాలి'

## కెనడా, ఫ్రాన్సుల తీర్మాన విజయం

### ఆటంబాంబు నిషేధానికి వీలుకలిగించాలని వివిధదేశాలకు సమితి ఆదేశం

వాషింగ్ టన్ మెడోస్ నవంబరు 23: అన్ని దేశాలు, అణుశక్తిపై అంతర్జాతీయంగా కట్టుదిట్టమైన అధిపత్యానికి అంగీకరిస్తూ, అణువుబాంబు నిషేధానికి వీలు కల్పించాలని, ఐక్యరాజ్యసమితి నేడు ఆదేశించింది. ఈ ఆదేశాన్ని పొందుపరచి, కెనడా, ఫ్రాన్సులు, సమితి సర్వసభ్య సభామోదమునకు ప్రతిపాదించిన తీర్మానము బ్రహ్మాండమైన మెజారిటీతో నెగ్గింది. తీర్మానమునకు అనుకూలంగా 49 ఓట్లు ప్రతికూలంగా ఐదుఓట్లు వచ్చినవి. మూడు రాజ్యాలు ఓటింగులో పాల్గొనలేదు. యివి దక్షిణాఫ్రికా, యుగోస్లావియా, ఇస్రాయిల్. ప్రతికూలంగా ఓటుచేసినది సోవియట్ రష్యా, దానిమిత్రరాజ్యాలు. కెనడా ఫ్రాన్సుల తీర్మానంలో ముఖ్యాంశాలు. (1)మానవాభ్యుదయమునకు దోహదముగు పద్ధతిలో అణుశక్తిని పెంపొందించే కృషికి అన్నిరాజ్యాలు పరస్పరం సహకరించాలి. (2) అణుశక్తిపై కట్టుదిట్టమైన అంతర్జాతీయ అధిపత్యం యేర్పాటు చేయడానికి సంబంధించినంతవరకూ, అన్ని రాజ్యాలు తమ సర్వ స్వతంత్రాధికారాన్ని కొంత పరిమితం చేసుకోవాలి. (3) అన్నిదేశాల ప్రభుత్వాలు, పరమాణుశక్తిపై కట్టుదిట్టమైన అంతర్జాతీయాధిపత్యాన్ని అంగీకరించి, అణువుబాంబు నిషేధానికి వీలుకల్పించే నిమిత్తం తమ చేతనైనంతా చేయాలి.

(4) అగ్రరాజ్యాలు ఐదు బ్రిటన్ అమెరికా, రష్యా, ఫ్రాన్సు, చైనాలు—కెనడా, రష్యాకు తదితర రాజ్యాలకు అణుశక్తిపై అంతర్జాతీయాధిపత్యం విషయంలో యేర్పడిన విభేదాన్ని పరిష్కరించుటకు ప్రయత్నిస్తూనే ఉండాలి.

అణ్వస్త్రముల నిషేధము, అణుశక్తి కంట్రోలు—ఈ రెండింటి విషయంలో రెండు ఒప్పందాలుండాలంటూ సోవియట్ రష్యా ప్రతిపాదించిన తీర్మానాన్ని సమితి నిరాకరించింది.

అణుశక్తి కంట్రోలు విషయంలో ప్రస్తుతం ప్రతిష్టంభన ఏర్పడడానికి కారణం, బ్రిటన్ అమెరికాలేనని, రష్యా తన తీర్మానంలో ఆరోపించింది. "కంట్రోలు" అనేపదానికి, అప్పుడప్పుడు ఆయా దేశాలలో అణుశక్తి ఉత్పత్తి కర్మాగారాల తనిఖీ అని రష్యా అర్థం చెప్పింది పశ్చిమరాజ్యాలు చెప్పిన అర్థం ఐక్యరాజ్య సమితి ఆధ్వర్యాన, అంతర్జాతీయ అణుశక్తి కంట్రోలు బోర్డు, అన్ని దేశాలలోని, అణుశక్తి ఉత్పత్తి కర్మాగారాలను స్వాధీనంచేసుకొని నిర్వహించడమని.

అధ్యక్షుడు, కార్లోస్ రోములో సమితి ఆమోదించిన తీర్మాన సారాంశమును ఒక్కముక్కలో యిలా చెప్పాడు, "వ్యవధి యింకా ఉండగనే మానవజాతిని విపత్తునుండి రక్షించడం."

## కొమింటాంగ్ ప్రతినిధులు చైనా ప్రజాప్రతినిధులు కారని విషిన్స్కీ

### సమితి సమావేశంలో రష్యావాదన: చైనా ప్రతినిధి సమాధానం

వాషింగ్ టన్ మెడోస్, నవంబరు 23: ఐక్యరాజ్య సమితిలోని చైనా ప్రతినిధివర్గం వారు చైనా ప్రజలకు ప్రతినిధులని రష్యా భావించబోదని సర్వ ప్రతినిధి సభలో రష్యా విదేశాంగమంత్రి ఆండ్రీ విషిన్స్కీ నేడు చెప్పారు.

ప్రస్తుతం సమితిలోఉన్న కోమింటాంగు ప్రతినిధులు ఇకమీద చైనా ప్రజలకు ప్రాతినిధ్యం వహించ జాలరని గతవారంలో చైనా కమ్యూనిస్టుల సర్వ ప్రతినిధి సభాధ్యక్షుడు కార్లోస్ రోమ్యులోకు కేబిల్ ఇచ్చి ఉన్నారు. సోవియటు యూనియను చైనా కమ్యూనిస్టులను బలపరుస్తున్నదని విషిన్స్కీ చెప్పారు. నేడు చర్చింపబడనున్న అణుశక్తి గురించి మాట్లాడక పూర్వం ఆయన ఈ ప్రస్తావన చేశారు.

అణుశక్తిని గురించి విషిన్స్కీ 90 నిమిషాలు ప్రసంగించిన అనంతరం చైనా ప్రతినిధి చియోహూకాన్ మాట్లాడుతూ, సోవియటు యూనియను ఐక్యరాజ్య నిబంధనలు ఉల్లంఘించి ఘోరమైన దురన్యాయాలు చేసినట్లు చైనా ప్రతినిధివర్గంవారు కొద్దిరోజులలో సాక్ష్యంతో సహా రుజువు చేయనున్నారని చెప్పారు. ఆయన రష్యా ప్రతినిధితో మాట్లాడుతూ "మీరుకోరినంత మాత్రంచేత చైనా కమ్యూనిస్టులు మాస్కో నాక్రమించరు. మీ కోరికలే శాసనాలయితే అది సాధ్యమై ఉండేదేమో. కాని అదృష్టవశాత్తు మీ మాటలకు ప్రచారానికుండే విలువమాత్రమే ఉన్నది," అన్నారు. ఈ సమావేశాలలో రష్యా వారితోపాటు తాముకూడా ఉండడం వారికి ఆవేదన కలిగిస్తున్నదని ఆయన ఆరోపించారు.

"మేమీసభలో కూర్చున్నా కూర్చోక పోయినా మీరాసేట అశలు పెట్టుకోనక్కర్లేదు. ఏమంటే నిర్ణయాలు చేసేది ఐక్యరాజ్య నిబంధనావళి, ప్రపంచ ప్రజాభిప్రాయమూ భగవంతుడూనూ" అని ఆయన విషిన్స్కీతో చెప్పారు.

చైనాప్రతినిధి ప్రసంగానికి సభ్యులు హర్షించారు.

ఆయన కూర్చోగానే అధ్యక్షుడు జనరలు రోమ్యులో, చైనాసమస్యను గురించి చర్చించదల్చినా, అదిచర్చించడానికి ఇంకా సమయం రాలేదని సభ్యులకు హెచ్చరిక చేశారు.

క్రమ సైన్యం ఆరోపిస్తూ విషిన్స్కీ ఈ విధంగా చైనాప్రతినిధికి జవాబు చెప్పారు:

"చైనాలో ఇప్పుడున్న క్రమ ప్రభుత్వం ఈ ప్రతినిధులకు స్థానం లేదంటున్నదని నేను సూచించాను, ఆ ప్రభుత్వాన్ని బలపరచడం మావిధి అని మా ప్రభుత్వానికి తోచింది. ఈ విషయమై తగూలాడుకో వలసిన పనిలేదు.

"జాతీయ చైనా ప్రతినిధులను స్థానాలు లేకుండా చేయమని నేనిప్పుడడగడంలేదు. చైనాలో జరిగిన పరిణామాలను బట్టి మనం ఈ ఆసాములను ప్రతినిధివర్గంగా భావించలేం. చైనా ప్రజా రిపబ్లికు ఒకటే చైనాప్రజలకుగల క్రమమైన ప్రభుత్వం."

విషిన్స్కీ కూర్చున్న అనంతరం అధ్యక్షుడు చైనాపై చర్చ అప్రస్తుతమని మళ్ళీ హెచ్చరించి అణుశక్తి చర్చ సాగనిమ్మన్నారు.

### చైనా తాత్కాలిక అధ్యక్షుడు లీసన్ జెన్

#### కమ్యూనిస్టులతో పోరాటు సంకల్పం

హాంకాంగ్, నవంబరు 23: చైనా తాత్కాలికాధ్యక్షుడు లీసన్ జెన్ చెంగై షేక్ తో విడిపోయి, దక్షిణచైనాలో తాను తనపార్టీసహాయంతో కమ్యూనిస్టులతో పోరుసలప నిశ్చయించినట్లు విశ్వసనీయమైన వర్గాలవారిద్వారా తెలుస్తున్నది.

తనకు ఈ విషయంలో అమెరికా ఏమన్నా సహాయం చేస్తుందేమో కనుక్కోవడానికి ఆయనత్వరలోనే అమెరికాకు పోనున్నట్లుకూడా వార్తలువస్తున్నాయి.

ప్రెసిడెంటు లీ ప్రస్తుతం హాంకాంగులో కడుపునొప్పికి మందు పుచ్చుకుంటున్నారు. ఈ సంవత్సరంలో ఒక అమెరికన్ సేనాని వైస్ అడ్మిరల్ ఆ. యస్. బర్కి ఆయన్ను చూడటానికి హాస్పిటల్ కు వచ్చారు. అప్పుడు ఆయన ఈ విషయాన్ని ఆయనకు తెలియజేసినట్లు ఒక ప్రముఖవ్యక్తి చెప్పుకుంటున్నారు.

అంతే కాకుండా తాను అమెరికా తన అస్వస్థ్యంలో వడి చే ఈ కాంపకు ఆర్థికంగా ఏమన్నా సహాయం చేస్తుందేమో తెలిసికొని, ఒక అరు వారాలలో తిరిగి చైనాకు రాగలనని కూడా ఆయన అన్నట్లు ఇక్కడ చెప్పుకుంటున్నారు.

చెంగైషేక్ నుంచి విడిపోయి లీ ఏర్పాటు చేయనున్న వర్గంలో జనరల్ పాయ్ చన్ షిరంటి సేనానులుకూడా చేరనున్నట్లు తెలుస్తున్నది. జనరల్ పాయ్ లీ అధ్వర్యంలో వుండే సైన్యాలకు అధినేతగా వుంటారు.

ఈ ప్రయత్నాన్నుంచి ప్రెసిడెంటు లీ ని విముఖుణ్ణిచేసేనిమిత్తం చాంగైషేక్ తీవ్ర ప్రయత్నాలు చేస్తున్నారు. జనరల్ లీని చుంకింగ్ కు తిరిగిరావలసిందిగా చాంగ్ ఇద్దరు వార్తాహరులను పంపారు. కాని లాభంలేకపోయింది.

ఈ వచ్చిన వార్తాహరులలో ముఖ్యుడు చైనా ఉపప్రధాని ... గూడా వున్నారు. ఆయన ఇవ్వాళ్ల పత్రికావిలేఖరులతో మాట్లాడుతూ, తమ ప్రయాణాన్ని వాయిదా వేసుకున్నామని అన్నారు. నిజానికి వారు రేపు బయలుదేరవలసి వుంది.

## నేపాలు-ఇండియా మిత్రత్వ సంధి

### ఉభయపక్షాల ఏకీభావము

న్యూఢిల్లీ, నవంబరు 23: నేపాలు భారతదేశముల మధ్య మిత్రత్వ, వాణిజ్య సంబంధమైన సంధి చేసికొనుటకై ఉభయదేశముల ప్రతినిధులకును జరుగుచుండిన సంభాషణలు నేడు పూర్తియయ్యెను. ఈ ఒడంబడికకు ఆధారభూతముగా నున్న సిద్ధాంతములపై ఉభయ పక్షములవారును ఏకీభావమునకు వచ్చిరని, నమ్మకముగా తెలియుచున్నది. స్థూల సిద్ధాంతములపై ఏకీభావమేర్పడుటచేత వివరములు తరువాత చర్చింపబడును. ఇందుకుగాను జనవరి ప్రారంభమున నేపాలు రాయబార వర్గము ఢిల్లీకి వచ్చును.

## మాస్కోలోని సయాం కార్యాలయం మూసివేత

బాంగ్ కాక్, నవంబరు 23: మాస్కోలోని తమ కార్యాలయాన్ని మూసివేసి "ఖర్చుతగ్గించుకొనే నిమిత్తం" అక్కడ ఉన్న ఇద్దరు అధికారులను వెనుకకు రప్పించాలని సయాము మంత్రివర్గం తీర్మానించింది.

బాంగ్ కాక్ లోని రష్యను కార్యాలయాన్ని రష్యనులు మూసివేయక పోవచ్చుననీ, ఆస్ట్రేలియా కంటెటికీ రష్యనులకు కార్యాలయం ఉన్నది ఒక్క సయాములోనే ననీ సయాం విదేశాంగ శాఖ వారన్నారు.

## మద్రాసు కార్పొరేషను వారికి ఋణ నిరాకరణ

మద్రాసు, నవంబరు 24: దిగువమధ్య తరగతి ప్రజలకు చిన్నచిన్న ఇళ్లు నిర్మించటానికై 1950-51 వ సంవత్సరంలో 5 లక్షల రూ॥ల ఋణం మంజూరు చేయవలసిందని మద్రాసు కార్పొరేషనువారు ప్రభుత్వాన్ని కోరారు. ప్రస్తుతం ఉన్న వాటిని అభివృద్ధి చేయుటకు మరొక $1\frac{1}{2}$ లక్షల రూ॥ల ఋణమును కోరారు. కాని ప్రస్తుతం యీ ఋణామును మంజూరు చేయలేమని ప్రభుత్వం వారన్నట్లు తెలిసింది.

## పరిషత్తులో వింధ్య ప్రదేశసభ్యులు

### పదవీస్వీకరణ: ఉపన్యాసాలకు కాలపరిమితి

న్యూఢిల్లీ, నవంబరు 24: భారత రాజ్యాంగపరిషత్తుకి వింధ్యప్రదేశ్ నుంచి ప్రతినిధులుగా నియమితులయిన అవధేశ్ ప్రతాప్ సింగ్, శంభునాథ్ శుక్లా, రాం సహాయ్ తివారీ, మన్నూలాల్జీ ద్వివేదిగార్లు నేడుతమ పదవులను స్వీకరించారు.

చర్చను మొదలపెట్టబోతుండగా అధ్యక్షుడు రాజేంద్రప్రసాద్ గారు లేచి ఉపన్యాసాలు 5 నిమిషాలకు మించకూడదని సూచించారు. ఇప్పటికి 77 మంది మాట్లాడినా, మరి 54 మంది ఉపన్యసించ కోరుతున్నారని మిగిలినవాళ్ళకుకూడా ఏదో నాలుగుముక్కలు మాట్లాడి రికార్డులోకి ఎక్కే అవకాశం ఇవ్వాలనీ ధలోక్తిగా అన్నారు.

చౌధరీ రంజిబార్ సింగ్ చర్చప్రారంభిస్తూ రైతులు మార్కెట్టు ఒడుదుడుకులవల్ల తమ పంటను తక్కువధరలకు అమ్ముకోవలసిన దుస్థితి పట్టకుండా రాజ్యాంగం హామీ ఇవ్వాలన్నారు.

ఎన్. ఎల్. వర్మగారు మాట్లాడుతూ రాజస్థాన్ లో జమీందారీ విధానాన్ని నిర్మూలించాలన్నారు. బ్రజేశ్వర్ ప్రసాద్ గారు మాట్లాడుతు నిపుణులచేత నిర్వహించబడే దృఢకేంద్రాధిష్ఠిత ప్రభుత్వమే మంచిదనీ, వాషింగ్టన్, లండన్, మాస్కో ప్రభుత్వాలలో మాస్కో ప్రభుత్వమే ఉత్తమమనీ అన్నారు. పార్లమెంటరీ విధానం ఆధునిక యుగంలో నిలవలేదని అన్నారు.

శ్రీమతి పూర్ణిమా బెనర్జీ ఉపన్యసిస్తూ ఆధునిక సమాజానికి కావలసిన కనీస కోరికలను రాజ్యాంగం సఫలం చేస్తున్నదని అన్నది. పరిపాలనా సూత్రాలు అమలు జరిగితీరవలెనని, కోర్టుల కెక్కటానికి వీలులేక పోయినప్పటికీ మొత్తానికి అవి ప్రభుత్వ నిర్వహణకు ప్రాతిపదికగానే ఉండగలవని ఆమె అన్నది. ఉప్పు పన్నును తొలగించనందు కామె విచారం వెల్లడించినది.

## సైకిల్ ఫ్యాక్టరీలు

### భారతీయ భాగస్వాములతో స్థాపన: బ్రిటిష్ కంపెనీల నిర్ణయం

న్యూఢిల్లీ, నవంబర్ 23: బ్రిటన్ లో తయారు అవుతున్న సైకిళ్ళవంటి నాణ్యం గల సైకిళ్ళనే ఇండియాలో తయారుచేయగలందులకై 3 ప్రసిద్ధ బ్రిటిష్ కంపెనీలు భారతీయ భాగస్వాములతో కలిసి ఇండియాలో పలుచోట్ల సైకిలు ఫ్యాక్టరీలను నెలకొల్పబోతున్నవి. రాలే సైకిల్ కంపెనీవారు సేన్ అండ్ పండిట్ కంపెనీ అనే బెంగాల్ కంపెనీతో చేరి సేన రాలే ఇండస్ట్రీస్ (ఇండియా) లిమిటెడ్ అనే పేరుతో ఒక సైకిల్ ఫ్యాక్టరీని నిర్మించడానికి నిశ్చయించారు. ఈ కంపెనీకి సాలీనా లక్షసైకిళ్లు తయారుచేసి విక్రయించడానికి అనుమతి ఇవ్వబడినది.

ఈ విధంగా బి. ఎస్. ఏ. కంపెనీ వారుకూడా ఇంకో ఫ్యాక్టరీని నెలకొల్పబోతున్నారు. మొదట్లో మైసూరు ప్రభుత్వంతో భాగస్వాములుగాచేరి మైసూరులో ఫ్యాక్టరీ పెట్టాలి అనుకున్నారుగాని దరిమిలాను కార్ఖానాను మద్రాసులో పెట్టాలని మనసు మార్చుకున్నారు. మదరాసులోని ఒక స్థిరీటేటుకంపెనీతో వీరు భాగస్వాములు అయినారు. మద్రాసు ప్రభుత్వంకూడా ఈ కంపెనీలో భాగస్వామిగా చేరాలని చూస్తున్నది. 3వ కంపెనీ హెర్క్యులిస్ వారిది. వీరు సైకిళ్ళే గాకుండా కొన్ని రకాల లోహపు గొట్టాలుకూడా పరిశ్రమలలో ఉపయోగార్థం ఉత్పత్తి చేస్తున్నారు. ఈ కంపెనీకూడా ఇండియాలో ఒక సైకిల్ కార్ఖానా పెడుతున్నది.

మూడు కంపెనీలు కలిసి సంవత్సరానికి మొత్తంమీద 3 లక్షల సైకిళ్లు మాత్రమే ఉత్పత్తి చేయాలని నిర్ణయించబడెను. ఇండియా ప్రస్తుతం విదేశాలనుండి సాలీనా 5 లక్షల సైకిళ్లు దిగుమతి చేసుకుంటున్నది. దేశీయ ఉత్పత్తిదార్లకు దెబ్బ తగలకుండా తగిన జాగ్రత్తలన్నీ ప్రభుత్వం తీసుకున్నది. మనదేశంలో ప్రస్తుతం 90 వేల సైకిళ్లు సాలీనా ఉత్పత్తి అవుతున్నవి: ఫ్రేములు, గొలుసు, మొదలైన ప్రధాన భాగాలను 3 కంపెనీలు ఒకే ప్రమాణాలను అనుసరించి తయారు చేయాలనీ, ఇండియాలో ఉత్పత్తిచేసే సైకిళ్ల నాణ్యం బ్రిటిష్ సైకిళ్లు నాణ్యానికి తీసిపోకూడదనీ, ఇక్కడ చేసే సైకిళ్లకు కూడా బ్రిటిష్ పేర్లే ఉంచాలనీ, భారతీయులకు సాంకేతిక రహస్యాలన్నీ తెలిపి తర్ఫీదు చేయాలనీ, ప్రభుత్వం షరతులు విధించింది.

## జపానులో మహాత్ముని వ్యాప్తికై కృషి

### ఆశ్రమముల నేర్పరుచు సంకల్పము

అలహాబాదు, నవంబరు 24: 'అన్ని మతములవారును గాంధిమహాత్ముని ఉపదేశామృతమును గ్రోలవీలగుటకుగాను మేము జపానులో గాంధి ఆశ్రమములను స్థాపింప సంకల్పించుచున్నాము' అని శాంతినికేతనములో జరుగనున్న ప్రపంచశాంతి కాముల సభకు విచ్చేసిన జపాను ప్రతినిధి డా॥ (శ్రీమతి) టోమికో కోరా నేడిచ్చట చెప్పెను.

'గాంధిమహాత్ముని సిద్ధాంతముల వ్యాప్తి నిమిత్తమై మేము టోకియోలో ఇండో-జపాను సంఘము నొకదాని నేర్పరచితిమి. ఈ సంఘమునకు ప్రధాని షిగేరూయోషిదా గౌరవాధ్యక్షుడు. ఈ సంఘము యొక్క శాఖ నొకదానిని భారతదేశములో స్థాపింప మేము సంకల్పించుచున్నాము. ఈ సంఘమునకు గౌరవాధ్యక్షపదవిని స్వీకరించవలసినదిగా పండిత నెహ్రూగారిని కోర మేము సంకల్పించుచున్నాము. గాంధిమహాత్ముని ఆశయముల వ్యాప్తికై జపానులో జరుగుచున్న కృషి ఈ సంఘముద్వారా భారతీయులకు తెలియగలదు. పైని పేర్కొనబడిన ఇండో-జపాను సంఘముమాత్రమే గాక జపానునందంతట గాంధిమహాత్ముని శాంతి, ప్రేమ సందేశమును వ్యాపింపజేయుటకు యింకా మూడు సంఘములను మేము స్థాపించితిమి' అని శ్రీమతి టోమికోకోరా చెప్పెను.

## పక్షంరోజుల్లో నల్గొండ, వరంగల్ జిల్లాలలో 16 మంది హత్య

### కమ్యూనిస్టుల దురాగతాలు: అరికట్టటానికి పోలీసు, మిలిటరీ చర్యలు

హైదరాబాద్, నవంబర్ 23: నవంబరు 15 తో అంతమగు పక్షం రోజులలోను నల్గొండ జిల్లాలో కమ్యూనిస్టులచే 10 మంది హత్య చేయబడినారనీ, 1949 జనవరి నుండి జిల్లాలో జరిగిన హత్యల సంఖ్య 191 వరకు వెళ్లినదనీ నేడు తెలియవచ్చింది. పై పక్షం రోజుల్లో వరంగల్లు జిల్లాలో జరిగిన హత్యలు ఆరు. దీనితో సంవత్సరం మొదటి నుండి యీ జిల్లాలో జరిగిన హత్యలు 48 అయినవి.

నవంబరు మొదటి వారంలో నల్గొండ జిల్లాలో కమ్యూనిస్టు ఉధృతం బాగా ఉన్నదట. కాని ఆ తర్వాత వారంలో పోలీసు, మిలిటరీ చర్యల వల్ల యిది చాల వరకు తగ్గించబడింది. ప్రస్తుతం కమ్యూనిస్టులు జనగాం ప్రాంతంలోను, కృష్ణానది పరిసరాలలోను ఉంటున్నారు. ఇంగలలింగా రెడ్డి నాయకత్వాన సాయుధ కమ్యూనిస్టుల గుంపొకటి హుజూర్ నగర్ తాలూకాలో ఒక గ్రామంపై దాడిచేసి శేషారెడ్డి అనువానిని ఆయన భార్యను హత్య చేశారు. ఈ దళం వారే కొండ నాగయ్య, అల్లం థామస్ రెడ్డి గొడ్డపల్లి రామిరెడ్డిని కూడ హత్య చేశారు.

వరంగల్లుజిల్లా ఖమ్మం పరిసరప్రాంతాలలో కమ్యూనిస్టు స్థావరంపై రిజర్వుపోలీసులు దాడిచేసినప్పుడు గంగరపు శ్రీనివాసరావు, పెద్దమన్సూర్, చిన్నమన్సూరు, బుచ్చిగాడు, చంద్రయ్య అను 5 గురు కమ్యూనిస్టులు కాల్చి చంపబడినారు. అప్పనాజుపల్లి అను గ్రామంవద్ద సాయుధ కమ్యూనిస్టులకు, రిజర్వు పోలీసులకు సంఘర్షణ జరిగినప్పుడు లచ్చిగాడు అను ప్రముఖ కమ్యూనిస్టు కాల్చి చంపబడెను. ఇతనినుండి కొన్ని తుపాకులు, మందుగుండుసామాను స్వాధీనం చేసుకోబడినవి. కాకరాయివద్ద కమ్యూనిస్టు స్థావరంపై రిజర్వు పోలీసులు దాడిచేసినప్పుడు గోంపయ్య అను ప్రముఖ కమ్యూనిస్టు కాల్చి చంపబడెను. మాలుగు తాలూకాలో తప్పాసరసయ్య అను ధని కుని కమ్యూనిస్టులు హత్యచేసి ఆతనినుండి 35 వేల రూ॥ఆస్తిని దోచుకొన్నారు.

## ఉత్పత్తి ప్రమాణాల నిర్ణయం

### వ్యవసాయశాఖాధికారుల సభ

న్యూఢిల్లీ, నవంబర్ 23: రాగల సోమవారంనాడు ఆరంభమై యిక్కడ 3 రోజులపాటు జరుగనున్న వ్యవసాయ శాఖాధికారుల సభను భారత ప్రధాని పండిట్ నెహ్రూ ప్రారంభించగలరని నేడిక్కడ తెలుపబడింది.

1949-52 మధ్య సాధించవలసిన ఉత్పత్తిప్రమాణాలు, పెద్ద వ్యవసాయ కూడలు ఏర్పడడానికి ప్రోత్సాహం యివ్వడానికిగాను చేయదగిన చర్యలూ, తెగుళ్ల వల్ల వలిగే పంటనష్టాన్ని తగ్గించే మార్గాలు కొత్తభూమి సాగుచేసే పథకాలు మొదలైనవి యీసభలో చర్చించబడతవి.

## రిపబ్లిక్ అధ్యక్షుని ఎన్నిక

(1-వ పేజి తరువాయి)

ఆహ్వానింపబడతారని, డా॥ ప్రసాద్ తెలిపారు.

రేపటి శనివారంనాడే తాను రాజ్యాంగమును అధికారరీత్యా ధ్రువపరచవలసి వుందని డా॥ ప్రసాద్ అన్నారు. ఎందుచేతనంటే ఆరోజుననే రాజ్యాంగములోని కొన్ని నిబంధనలు అమలులోకి రావలసి వున్నది. కాని అసలు రాజ్యాంగమంతా కలిసి జనవరి 26 వ తేదీ అమలులోకి వస్తుంది.

"చాలమంది సభ్యులు రాజ్యాంగపు లిఖిత ప్రతికావాలని కోరుతున్నారు. అందుచేత లిఖిత ప్రతిని తయారుచేయించటానికి కొందరు. వ్రాయసకాండ్రను ఏర్పాటుచేస్తున్నాము. లిఖిత ప్రతితోపాటు ముద్రిత ప్రతికూడా ఒకటి వుంటుంది. సభ్యులు ఏ ప్రతిమీదనైనా సంతకం చెయ్యవచ్చు. కావలిస్తే రెంటిమీదా చెయ్యవచ్చు. అట్టి ఋవ్వు కాదనితోస్తే, ప్రతి సభ్యునికి రాజ్యాంగ ముద్రిత ప్రతి నొకదానిని, అందులో సభ్యులందరి సంతకాలను ఫోటో తీసి ముద్రించి పంచిపెడతాము."

## భారత సమాఖ్యలో జనవరి 26-న హైద్రాబాదు సంస్థాన ప్రవేశం

### రాజ్యాంగరీత్యా అమలు: త్వరలో నిజాం నవాబు ప్రకటన

సికంద్రాబాద్, నవంబరు 24: నూతన భారత రాజ్యాంగం 1950 జనవరి 26 న అమలుజరుగుటతో పాటు రాజ్యాంగరీత్యా హైద్రాబాద్, భారతసమాఖ్యలో ప్రవేశించటం జరుగగలదని యిక్కడి విషయజ్ఞులు భావిస్తున్నారు.

ఈ విషయంలో నిజాం నవాబు అధికారయుతంగా ఒక ప్రకటన జారీచేస్తారు. ఈ ప్రకటన, భారత రాజ్యాంగాన్ని, హైద్రాబాద్ సంస్థానానికికూడ వర్తింపచేస్తుంది.

భారత రాజ్యాంగపరిషత్తులో హైద్రాబాద్ ప్రాతినిధ్యంవిషయం, యింకా కేంద్రప్రభుత్వ ఆలోచనలో నున్నట్లు యీ వర్గాలవారు అంటున్నారు.

## రష్యా ప్రతిపాదనకు ఇండియా అభ్యంతరం

### రాజకీయ సంఘంలో సర్ బి. ఎన్. రావు ప్రకటన

లేక్‌సక్సెస్, నవంబరు 23: నిన్న ఐక్యరాజ్య రాజకీయసమితిలో మాట్లాడుతూ ఇండియా ప్రతినిధి సర్ బెనెగల్ నరసింగరావు, బ్రిటను అమెరికాలు యుద్ధోన్మాదం ప్రచారం చేస్తున్నారని రష్యా ఆరోపించడానికి కారణం సోవియట్ పత్రికలమీదా, పాశ్చాత్య పత్రికలమీదా ఉండేకంట్రోలు పద్ధతులలో వ్యత్యాసమేనన్నారు.

నిన్నరాత్రి జరిగినచర్చలో ఆయన, రష్యాచేసిన శాంతిసూచనలపై వ్యాఖ్యానం చేస్తూ, రష్యాతీర్మానం ఆరంభంలో అమెరికా బ్రిటనులు మరొక యుద్ధంకొరకు సాగించేసన్నాహాలను ఖండించాలని లేకపోయినట్టయితే ఆ తీర్మానాన్ని ఇండియా బలపరచి ఉండేదనీ, అణుశక్తి అంతర్జాతీయంగా కంట్రోలు కావడం, అణ్వస్త్రాలు నిషేధించడం, అగ్రపంచకం శాంతి ఒడంబడిక చేసుకోవడమూ ఉదారాశయాలనీ ఆయన అన్నారు.

## కెరెన్ రాజధాని బర్మా ప్రభుత్వ వశం

రంగూన్, నవంబర్ 23: కెరెన్ ఆక్రమిత ప్రాంతానికి రాజధానిగా ఉన్న టౌంగ్యి నగరం నిన్న బర్మా ప్రభుత్వ సేనల వశమైనట్లు అధికారరీత్యా నేడు ప్రకటింపబడినది.

టౌంగ్యి రంగూనుకు ఉత్తరంగా 300 మైళ్ల దూరంలో ఉన్నది. దీనిని క్రితం ఆగస్టులో కెరెన్ సైన్యాలు ఆక్రమించుకొన్నవి. పూర్వం ఇదిదక్షిణ షాన్ రాష్ట్రాలకు ముఖ్య పట్టణంగా ఉన్నది.

తమలో చనిపోయిన వారిని అనేక మందిని వదలివేసి కెరెన్‌లు పారిపోయారని, పోరాటం వివరాలు యింకా తెలియరాలేదని, బర్మా ప్రభుత్వం తెలియజేసింది.

టౌంగ్యిని ఆక్రమించుకో గలగడం బర్మా ప్రభుత్వ సేనలకు చేకూరిన ఘన విజయమనే చెప్పాలి. అయితే, టౌంగ్యి పతనమైనంత మాత్రాన అంతర్యుద్ధ గమనంలో అపూర్వమైన మార్పేమీ రాదని యీ అంతర్యుద్ధంలో, ప్రభుత్వ సైన్యాల చేతుల్లో పట్టణాలు నగరాలు ఉంటే, తిరుగుబాటు చేస్తున్న విద్రోహులు గ్రామసీమల్లో విచ్చల విడిగా తిరుగుతూ భీభత్సం సాగిస్తుండడమే యిందుకు కారణమని అనుకొంటున్నారు.

ప్రభుత్వ సైన్యాలు, తూర్పు నుంచి, పడమరకు పురోగమిస్తున్నవని, యితర క్రితమే వచ్చిన వార్త వల్ల తెలుస్తున్నది.

మాండలేకు ఆగ్నేయంగా 10 మైళ్ల దూరంలో ఇరావతి దక్షిణపుగట్టున ఉన్న సెగియన్‌కు, మిట్కీనా వారు మధ్య ఉన్న ప్రాంతంలో రైల్వే రాకపోకలు తిరిగి పునఃకల్పించ బడినదని ప్రభుత్వాధికారులు చెప్పారు. తిరుగుబాటు చర్యల మూలంగా యీ రైల్వే మార్గం కడచిన మార్చి నెల నుండి మూసివేయబడి ఉన్నది.

## ఉద్యోగములనుండి తొలగింపబడిన ప్రభుత్వపనివారికి బోనసు

### త్వరలో ప్రకటన జరుగనున్నది

న్యూఢిల్లీ, నవంబరు 23: రైల్వేలు, ఆర్డినెన్సు ఫాక్టరీలు మున్నగు ప్రభుత్వ పారిశ్రామిక సంస్థలనుండి తొలగింపబడిన ఉద్యోగియులకు బోనసు యిచ్చు సూచనను ప్రభుత్వమువారు పరిశీలించుచున్నారు. మరల పని దొరకువరకు పనులలో నుండి తొలగింపబడిన ఉద్యోగియులు జీవయాత్ర సాగించ గలుగుటకుగాను మొత్తంగా కొంత ద్రవ్య మొసంగుట ఈ సూచన ఉద్దేశ్యమైయున్నది. ఈ స్కీము వివరములు నిర్ణయించబడుచున్నవి. ఈ స్కీము విషయమై త్వరలో ప్రకటన వెలువడనున్నది. (స్వ. వి.)

## విద్యుచ్ఛక్తి సప్లయి చేయ మైసూరు అంగీకారం

మదరాసు, నవంబర్ 23: మైసూరు ప్రభుత్వము జోగ్ కేంద్రము నుండి మదరాసు రాష్ట్రమునకు 6 వేల కిలోవాట్ల విద్యుచ్ఛక్తిని సప్లయి చేయుటకు అంగీకరించినది.

ఈ విషయమును పబ్లిక్ వర్క్సు మంత్రి శ్రీ యం. భక్తవత్సలం గారు విలేఖరులకు వెల్లడించుచూ మైసూరు ఇచ్చే విద్యుచ్ఛక్తి దక్షిణ కనరాకు ఇవ్వబడునని, ద కనరాలో పంపిణీకి సంబంధించిన స్కీమును ప్రభుత్వము మంజూరు చేసియున్నదని తెలిపిరి.

మైసూరు ప్రభుత్వము ఇదిగాక రాయలసీమ జిల్లాలకు 4 వేలకిలోవాట్ల విద్యుచ్ఛక్తిని సప్లయి చేయుచున్నది.

# ఐక్య ఇండొనీషియాకు వచ్చేనెల 27 న స్వాతంత్ర్య ప్రదానం

## జూలియానా రాణీ అధ్వర్యాన లాంఛనంగా అధికార దత్తత

### త్వరలో బటేవియాకు డచ్చి ఉపప్రధాని విదేశాంగమంత్రుల ప్రయాణం

హేగ్, నవంబరు 23: ఇండొనీషియా రిపబ్లిక్ అధికార ప్రదానోత్సవం సర్వలాంఛనసమేతంగా ఆమ్‌స్టర్డామ్‌లో డిసెంబరు 27 నో 28 నో జూలియానా రాణి అధ్యక్షతన జరుగుతుందని విశ్వసనీయంగా తెలియవచ్చింది. ఈ ఉత్సవానంతరం ఇండొనీషియా రాయబారవర్గం హేగ్‌నుండి స్వదేశానికి తిరిగి వెళ్ళినతోడనే అనగా బహుశా జనవరి 1 వ తేదీన బటేవియాలో ఒక రాజప్రతినిధి ఆచరణరీత్యా ఇండొనీషియా ప్రతినిధులకు అధికారం అప్పగింపబెట్టును. డచ్చి ప్రభుత్వం అధికార ప్రదానపుబిల్లును త్వరత్వరగా, వీలైతే డిసెంబరు 23 వ తేదీలోగానే, ఉభయ శాసనసభలచేత ఆమోదింపజేసి చట్టబద్ధంచేయాలని విశ్వప్రయత్నం చేస్తున్నది.

డచ్చి ఉపప్రధాని వాన్ మైక్, విదేశాంగమంత్రి డా॥ స్టిక్కర్ బటేవియాకు కొద్దిరోజుల్లో ప్రయాణమై వెళ్ళి, అధికార ప్రదానం ముందు చేయవలసిన తుది ఏర్పాట్లన్నీ ఖరారుచేసుకొనివస్తారని తెలుస్తున్నది.

బటేవియాలో తమకు తోచినవిధంగా అప్పటికప్పుడు నిర్ణయాలుచేసి పరిత్వరగా పూర్తి చేసుకొని రావడానికి డచ్చిమంత్రి వర్గం వీరిద్దరికీ సర్వాధికారాలు ఇచ్చింది. అధికార ప్రదానపుబిల్లు నిన్ననే దిగువసభలో ప్రతిపాదింపబడెను. డచ్చి ప్రభుత్వం చేసుకున్న కార్యక్రమాన్ని పట్టి, బిల్లుమీద దిగువసభలో డిసెంబరు 6 వ తేదీన చర్చజరిగి డిసెంబరు 23 వ తేదీకల్లా ఎగువ శాసనసభ చేత దానిని ఆమోదింపజేయడం అవుతుంది; తదనంతరం డిసెంబరు 27 నో 28 నో జూలియానా రాణి ఆమ్‌స్టర్డామ్‌లో ఇండొనీషియా ప్రతినిధి వర్గానికి యథావిధిగా అధికార ప్రదానం చేస్తుంది.

వలసశాఖా మంత్రి అయిన హెచ్. హెచ్. వాన్ మార్సెవీన్ చేతిమీదుగా బిల్లు పార్లమెంటులో నడపబడుతుంది. అధికార ప్రదానపుబిల్లు చాలా సంగ్రహంగాను సంక్షిప్తంగాను ఉన్నది. హేగ్ రౌండుటేబుల్ సమావేశంలో జరిగిన నిర్ణయాలను ఆమోదించి అమలు జరపవలసిందని కోరుతూ మూడు ముక్కలలో బిల్లు పూర్తిచేయబడినది.

బిల్లుకు అనుబంధంగా తగిలించిన ఒక ప్రత్యేక లేఖలో "అధికార ప్రదానంకన్న కూడా ఉభయదేశాలమధ్య ఆన్యోన్య విశ్వాస సమరస పూరితమైన వాతావరణాన్ని సృష్టించడం ఎక్కువ అవసరమని" వ్యాఖ్యానిస్తూ డచ్చి ప్రభుత్వం వ్రాసింది.

రాజకీయము చట్ట సంబంధము అయిన బంధాలకన్న స్నేహబంధమే దృఢతరమని కూడా వారు అందులో వ్రాసిరి. ఈ లేఖమీద మంత్రివర్గ సభ్యులందరూ సంతకాలు చేసిరి. ప్రతిబిల్లుకు ఉపోద్ఘాతం అటూ ఒకటి వ్రాయడం చిరకాలానుమైన సంప్రదాయం. కాని ప్రభుత్వం ఈ ఆచారాన్ని ఈ బిల్లు సందర్భంలో ప్రథమ పర్యాయంగా భంగించింది. రౌండుటేబుల్ సమావేశ తీర్మానాల పూర్తిపాఠాలూ, అందుకు సంబంధించిన డాక్యుమెంట్లూ మాత్రం బిల్లుకు గుచ్ఛబడినవి. పార్లమెంటులో బిల్లుకు అనుకూలంగా మూడింట రెండు వంతుల వోట్లూ గిట్టవో రావో అని ఇదివరలో కొంత సందేహం ఉండేది. కాని ఇప్పుడు ఆ అనుమానం తీరిపోయిందనే చెప్పవచ్చును. రౌండుటేబుల్ సమావేశ నిర్ణయాలకు భంగం కలిగితే తర్వాత ఏర్పడే విపరీతఫలిత పర్యవసానాలను ప్రతికూల పక్షంకూడా ఎదుర్కొలేదు. కాబట్టి వారుకూడా తమ వ్యతిరేకతను దిగమింగుకొని బిల్లుకు అనుకూలంగా వోటు చేస్తారని అందరూ ఇప్పుడు నమ్మకంగా అనుకుంటున్నారు. రౌండు టేబుల్ సమావేశానంతరం మంత్రివర్గంలో పెద్ద పెద్ద మార్పులు జరుగుతవని ఇలాగే కొన్ని వారాలకిందట బయలు దేరిన వదంతులు అయథార్థమని ఇప్పుడు తేలింది. ప్రస్తుత ప్రభుత్వం ఏకోవిధంగా బిల్లును నెగ్గించి తీరుతుందనటంలో సందేహంలేదు. అధికార ప్రదానానంతరం, దేశంలో తాము పరిష్కరించవలసిన అనేక సమస్యలను పురస్కరించుకొని మంత్రివర్గంలో చిన్న చిన్న మార్పులేమైనా చేస్తే చేయవచ్చును: కాని వాటికి రాజకీయమైన ప్రాధాన్యం ఏమీ ఉండదు.

### రిపబ్లికన్ పార్లమెంటు సమావేశం

బటేవియా, నవంబర్ 22: హేగ్ రౌండు టేబుల్ సమావేశంలో జరిగిన ఒడంబడికలను చర్చించడానికి డిసెంబర్ 5, 20 తే మధ్య రిపబ్లికన్ పార్లమెంటు సర్వసభ్యసమావేశం జరుపబడుతుందని పార్లమెంటు అధ్యక్షుడు డా॥ అస్సట్ జోగ్జకర్తాలో ఈవేళ ప్రకటించెను. పార్లమెంటు తాలూకు కార్యవర్గం ఒడంబడికలను ఆమోదిస్తే చాలదనీ, పార్లమెంటు సర్వసభ్యసమావేశం ఆమోదిస్తేనే ప్రజలకు తృప్తిగా ఉంటుందనీ, డా॥ అస్సత్ అనెను. మస్జుమీపార్టీ నేషనలిస్టు పార్టీకలిసి సభను తమ వైపుకు తిప్పుకోగలవని డా॥ అస్సత్ అనెను.

### హేగ్ ఒడంబడికను ఆమోదించవలసింది ఏ పార్లమెంటు?

బటేవియా, నవంబరు 23: హేగ్ రౌండ్ టేబిల్ సభ ఒడంబడికలను, తాత్కాలిక పార్లమెంటు వర్కింగ్ కమిటీ ఆమోదించాలా, లేక తాత్కాలిక పార్లమెంటే ఆమోదించాలా అన్న విషయాన్ని ఈ వారాంతంలో ఇండొనీషియా రిపబ్లిక్ మంత్రివర్గం సమావేశమై నిర్ణయిస్తుంది. ఈ ఒడంబడికలను, పార్లమెంటు సర్వసభ్య సమావేశమే ఆమోదించాలని వర్కింగ్ కమిటీ అభిప్రాయపడుతున్నట్లు తెలుస్తున్నది.

రాకపోకల యిబ్బంది లుండుటచేత, ఇండొనీషియాలోని అనేక శాఖలనుంచి, సభ్యలందరిని రప్పించి, పార్లమెంటు సమావేశం యేర్పాటు చేయడం అంత తేలికపనిగాదు.

డా॥ హట్టా రాకమూలంగా అంతవరకూ, హేగ్ ఒడంబడికలను దుయ్యబడుతూ, ప్రజలు సాగించిన విమర్శలు క్రమేమీ తగ్గిపోతున్నవి. ఇండొనీషియా రాజకీయ వర్గాలు యీ ఒడంబడికలను ఆమోదించగలవనే నమ్మకం ప్రబలుతున్నది. ఉదాహరణకు, పెమ్ మూన్ అనే అభ్యుదయ పక్ష పత్రిక వ్రాసిన దాన్ని చూడవచ్చు. "హట్టా, సోకర్నోలు మననాయకులుగా ఉండాలంటే, అనేక విషయాలలో హేగ్ ఒడంబడిక అసంతృప్తికరంగా ఉన్నప్పటికీ దానిని మనం అంగీకరించి తీరాలి. ఒడంబడికలను నిరాకరించామా, వాటితోపాటు, హట్టా సోకర్నోలకుకూడా వదులుకోవాలి. కాని వారిని వదులుకోవలసిన సమయంగాదు."

హేగ్ చర్చలకు దూరంగా ఉన్న మాజీ ప్రధాని షారియర్ హేగ్ ఒడంబడికకు తుది పరిష్కారానికి ప్రాతిపదిక కాగలదన్నారు.

### ఛలామణిలోని నోట్ల తగ్గుదల

బొంబయి, నవంబరు 23: నవంబర్ 18 వ తేదీతో అంతమైనవారంలో, ఛలామణియందున్న కరెన్సీనోట్లు 4.14 కోట్ల రూ. ల వరకు తగ్గినవని, అనగా 1079.37 కోట్ల రూ. ల విలువగల నోట్లు మాత్రమే ఛలామణియందున్నవని, బ్యాంకింగ్ డిపార్టుమెంటులో ఉన్న నోట్లు విలువ, 4.41 కోట్ల రూ. ల. వరకు పెరిగినవని రిజర్వుబ్యాంక్‌వారు ప్రకటించారు. కేంద్రప్రభుత్వ డిపాజిట్లుకూడా 4.11 కోట్ల రూ. లు అనగా 139.22కోట్ల రూ. లకు తగ్గినవి.

## "ప్రభుత్వోద్యోగులకు విలువగల బహూకృతులివ్వరాదు"

### పండిట్ నెహ్రూ ప్రకటన

న్యూఢిల్లీ, నవంబరు 23: పౌరులు విలువగల పెటికలతో, ముఖ్యంగా వెండి బంగారులతో చేసిన నాటితో సన్మాన పత్రాలు సమర్పించరాదనీ, ప్రజాహిత సంస్థలు అటువంటి బహూకృతులివ్వడం అనుచితమనీ హెచ్చరిస్తూ భారత ప్రధాని పండిట్ నెహ్రూ నేడీవిధంగా ప్రకటించారు:

"ప్రజాహితసంస్థలు మొదలైనవిశ్వస్తులను గౌరవించనెంచోసరం సన్మాన పత్రాలు సమర్పించడమూ, వాటిని ఖరీదైన పెటికలలో పెట్టి బహూకరించడమూ ఆచారమై ఉన్నది. ఈ పెటికలు వెండివి, ఒక్కొక్కప్పుడు బంగారువీ కావడంకద్దు. విలువగల పెటికలను బహూకరించవద్దని నేననేక పర్యాయాలు హెచ్చరించాను. ముఖ్యంగా వెండితో నూ, బంగారంతో నూ చేసిన వీ, రత్న ఖచితమైనవీ వర్జించాలి. అందచందాలూ, శిల్పనైపుణ్యమూ ఖరీదైనలోహాల మీదగాని రత్నాలమీదగాని ఆధారపడవు.

"పెటికలు బహూకరించే ఆచారం మహాత్మగాంధీకి నచ్చేదికాదు. ఏ కాలంలోనైనా ఇది మంచి ఆచారంకాదు. ప్రత్యేకించి పొదుపు పాటించవలసిన ఈ తరుణంలో ఇట్టి దుర్వ్యయం అనుచితం.

"ప్రభుత్వోద్యోగులకు ప్రజా హిత సంస్థలు ఇట్టి బహుమతులు ఇవ్వడం భావ్యంకాదని నా భావం. ఇందువల్ల వారికి గిజాటుగా ఉంటుంది. అందుచేత ఇది ఆదరణీయంకాదు.

"రాష్ట్ర ప్రభుత్వాలూ, మంత్రులూ, పైన చెప్పిన సలహాపాటించి, తమ ఉద్యోగులకు సలహా ఇస్తారని విశ్వసిస్తున్నాను."

## రూర్కీకి 25 వ తేదీన ప్రధాని నెహ్రూ రాక

రూర్కీ, నవంబరు 23:— రూర్కీ ఇంజనీరింగ్ విశ్వవిద్యాలయం ప్రారంభోత్సవ సందర్భంలో స్నాతకోపన్యాసం ఇచ్చే నిమిత్తం నెహ్రూ ఇక్కడకు నవంబరు 25 వ తేదీ నాడు వస్తారు.

25 వ తేదీ నాడు ఇక్కడకు వచ్చిన వెంటనే పండిట్ నెహ్రూ రెవ జార్జి ఇంజనీరింగ్ కేంద్రాన్ని పరిశీలించి కల్నల్ జె. ఎస్. థిల్లాన్ ఏర్పాటు చేసిన గౌరవాభినందనాన్ని స్వీకరిస్తారు.

తరువాత గవర్నర్ మోడీ వెంట రాగా ఇంజనీరింగు ప్రదర్శనాన్ని భారత ప్రధాని తిలకిస్తారు.

ఈ సందర్భంలో జరుగనున్న ఇంజనీరింగు కాలేజి శతవార్షికోత్సవ వారమును పురస్కరించుకొని విపులమైన సన్నాహాలు చేస్తున్నారు. 24 వ తేదీ నాటికే యు. పి. గవర్నర్ హోమీ మోడీ ఇంజనీరింగ్ కాలేజిని దర్శిస్తారు. ఆ రోజుననే ఆయన కాన్వొకేషన్ మందిరంలో నీటి పారుదల సౌకర్యాల తాలూకు కేంద్రసంఘ సమావేశాన్ని ప్రారంభిస్తారు. శ్రీమతి మోడీ ఇంజనీరింగ్ ప్రదర్శనాన్ని ప్రారంభిస్తుంది. అవ్వాళ్ళ సాయంత్రం పూర్వ విద్యార్థుల సమావేశం జరుగుతుంది.

25 వ తేదీ నాడు యు.పి. ప్రధాని పండిత గోవింద వల్లభ పంత్ శతవార్షికోత్సవాన్ని ప్రారంభించి శత వార్షిక మందిరానికి శంకుస్థాపన చేస్తారు.

అవ్వాళ్ళ మధ్యాహ్నం గవర్నర్ మోడీ రూర్కీ ఇంజనీరింగు విశ్వవిద్యాలయాన్ని ప్రారంభిస్తారు. పండిట్ నెహ్రూ స్నాతకోపన్యాసం ఇస్తారు.

ఈ విశ్వవిద్యాలయానికి ప్రొఫెసర్ జి. ఎ. వార్టన్ మైన్ — ఛాన్సలర్‌గా నిశ్చయించారు.

## నగరి పంచాయతీబోర్డుకు ఉప ఎన్నికలు

నగరి, నవంబర్ 23: స్థానిక పంచాయతీబోర్డులో ఖాళీగావున్న రెండు స్థానాలకు నేటి మధ్యాహ్నం జిల్లా పంచాయితీ అధికారి కే. నరసింహరాజుగారి అధ్వర్యాన ఎన్నికలు జరిగినవి. కె. పొందుసెట్టి, కె. ఎన్. నారాయణసెట్టిగార్లు ఎన్నికైనట్లు ప్రకటింపబడింది. (స్వ. వి.)

### అఖిల భారత కుటీర పరిశ్రమల బోర్డు స్థాయి సంఘం

అఖిల భారత కుటీర పరిశ్రమల బోర్డు చేసేత స్థాయి సంఘ సభ్యునిగా యం. యస్. ఏ. మజీద్, యం. యల్. ఎ. గారిని నియమించుటకు ఇండియా ప్రభుత్వము అనుమతించి యున్నది.

## "ముస్లిము శాసన సభ్యులు రాజీనామా ఇవ్వాలి"

ఒక ఆంధ్ర ముస్లిము యిట్లు వ్రాయుచున్నారు:—

ఆంధ్రరాష్ట్రమేర్పడుటవలన ముస్లిము శాసనసభ్యులకు చిక్కు వచ్చినది. కొందరు తమిళనాడు ముస్లిములు, ప్రత్యేక నియోజకవర్గము లుండినందున, ముస్లిములీగు సహాయాన స్థానిక ముస్లిములను త్రోసిరాజుచేసి, ఆంధ్ర ప్రాంతాల నుండి శాసనసభ్యులుగ ఎన్నికొనబడిరి. ఆంధ్రరాష్ట్రము ఏర్పడినాక వారు శాసన సభ్యులుగా నుండతగదు. రాజీనామా లిచ్చుట వారివిధి. ఆంధ్రజిల్లాలలో నివాసముండు ముస్లిములే ఆంధ్ర శాసనసభయందుండతగును.

## చిత్రకారుడు భాగీరథి అకాల మరణం

మదరాసు, నవంబరు 23: వి. వి. భాగీరథిగారు, జగ్గంపేట తూర్పుగోదావరిజిల్లా, సుప్రసిద్ధ ప్రకృతి చిత్రకారుడు 19 వ తేదీన 47 ఏట కాలధర్మము నొందిరని తెలుపుటకు ఎంతయు విచార మగుచున్నది. వీరి చిత్రములను దక్షిణదేశమున పలువురు పెద్దలు మెచ్చుకొని గైకొనిరి. వీరి భార్యయు కొద్దిరోజుల క్రితమే చనిపోయెను. తల్లి సోదరులు, బిడ్డలు బంధుమిత్రులు పలువురు వీరికై విచారించుచున్నారు. అని ఎస్. ఎన్. చేమకూర్ గారు ద. ఇ. చిత్రకారుల సంఘ కార్యదర్శి వ్రాయుచున్నారు.

## సభలు-సమావేశాలు

సత్తిలంకన్ మిషన్ హైస్కూలులో నవంబరు 26 న. గాంధిజీ విగ్రహావిష్కరము జరుగును.

ఏలూరు తాలూకా వ్యవసాయకూలీ యూనియన్ మహాసభ నవంబరు 25 న భీమడోలు ట్రావెలర్స్ బంగళాలో వేముల కూర్మయ్యగారి అధ్యక్షతన జరుగును.

హిందూపురం రైల్వేస్టేషనువద్ద నవంబరు 27 న మహాత్మాగాంధి విగ్రహావిష్కారం జరుగును.

గుంటూరుజిల్లా అడవి చెంచుల మహాసభ మాచెర్లలో డిసెంబరు 30 న జరుగును. గోగినేని లక్ష్మీనారాయణగారు ప్రారంభోపన్యాసం, కన్నెలగంటి రాఘవయ్యగారు జెండా ప్రతిష్ఠాపన చేసెదరు.

డిసెంబరు 3-వ తేదీన కృష్ణాజిల్లా గుడివాడలోని సి. ఎం. ఎస్. ఆవరణలో క్రైస్తవ మహాసభ జరుగునని ఆంధ్రరాష్ట్ర క్రైస్తవ మహాజనసభ ఉపాధ్యక్షుడు జాలాది ఇమ్మానుయేలుగారు వ్రాసిరి.

## మదరాసు ధరలు

మదరాసు, నవంబరు 24:

బంగారు - వెండి నేటి మధ్యాహ్నం 1 గంటకు వరకు 1-8 ఎడ్వర్డు బొంబాయి సెటిల్మెంటు తోపని రు. 77-0-0 పెట్టా బంగారు తులం 115-0-0 మాసబంగారు 113-0-0 సీమవెండి తులం 100-8 (కెడీ) 170-0-0 వెండి తులం 1 కి 1-12-0

వేరుసెనగ: (581 పా 1-8 ఎర్ర కోస్తాగిడ్డంగులు) మెషీన్ (సెటిల్మెంటుతో సహా) బజారుకొత్తది. 159(కోరమాండల్) వేరుసెనగనూనె ఎక్స్‌పెల్లర్ (పీపకేజ్) డిసెంబరు డెలివరీకి రు. 337, 338

8 టు 5% యస్. యస్. ఎ,

కొంకాయనూనె(87 పౌన్లు గల డబ్బా) ఒకటికి కొచ్చిన్ క్విలాన్. రు. 35-12-9, 37-8-9

ఆముదం

కాండి 500 పౌనులుగలది చిల్లరగా రు. 250-0-0, 260-0-0

పంచదార

ప్యారీ (2 అందరు) రు. 91-14-6


డిశెంబరు 2వ తేదీన విడుదల

ఆంధ్రదేశమున అన్ని ముఖ్య కేంద్రములలో

భాగ్యపిక్చర్సు వారి

మంగయర్కరసి

చిన్నప్ప·కన్నాంబ·అంజలీదేవి·కృష్ణన్
మధురం·దొరైరాజ్·లలిత·పద్మిని

VENDHAN

డిస్ట్రిబ్యూటర్లు ఆంధ్రా ఫిలిం సర్క్యూటు 18/168ఎ, గాంధీనగర్ విజయవాడ


## సరిగా నున్న నామినేషనుల జాబితా

## మద్రాసు కార్పొరేషన్ - 30-వ (చింతాద్రిపేట) డివిజన్

| వరుస నెంబరు | అభ్యర్థుల పేర్లు | అభ్యర్థులు స్త్రీలా పురుషులా | అభ్యర్థుల మతము | అభ్యర్థుల విరునామా | అభ్యర్థులకు నిర్దేశింపబడిన విస్పష్టమగు రంగులు |
|---|---|---|---|---|---|
| 1. | కృష్ణస్వామి మేస్త్రీ ఏ. | పురుషుడు | హిందు | 21 వాషర్‌మన్‌పేట | ఎరుపుచారతో నీలము రంగు |
| 2. | లక్ష్మణస్వామి టి. జి. | పురుషుడు | హిందు | 44 అరుణాచల నాయకన్ వీధి | తెల్లచారతో ఆకుపచ్చ రంగు |
| 3. | మూర్తి వి. వి. | పురుషుడు | విశ్వకర్మ | 10 వరదప్పమెన్ కోయిర్ వీధి | సింధూరతో తెల్లరంగు |
| 4. | వేణుగోపాల్ నాయగర్ ఎస్. | పురుషుడు | హిందు | 89 స్వామి నాయకన్ వీధి | గులాబి రంగు |

నోటు:— ఇదివరకే తెలియపరచబడిన పోలింగు స్టేషనువద్ద 30—11—1949 తేదిన మధ్యాహ్నము 12 గంటలనుండి 1 గంటవరకు విరామములో, ఉదయము 7 గంటలు, సాయంత్రము 6 గంటలమధ్య పోల్ తీసుకొనబడును.

రిప్పన్ బిల్డింగ్సు,
వి. టి. మదరాసు.
తేది 23-11-1949.

సి. నరసింహాం,
కమీషనరు,
మద్రాసు కార్పొరేషను.

## రాయలసీమ బ్యాంక్ లిమిటెడ్.

హెడ్డాఫీసు: బళ్లారి

మద్రాసులోను, రాయలసీమలోను ముఖ్యమైన చోట్లను బ్రాంచీలు కలవు.

కాల్ & షార్టు నోటీసు డిపాజిట్లు మంచి వడ్డీ రేట్లమీద బ్యాంకువారు అంగీకరించెదరు.

బ్యాంకు హెడ్ ఆఫీసు నుండి పైన వివరములు తెలిసికొనవచ్చును.

బళ్లారి 21-11-49 } పి. వి. సుబ్బారావు, బి.ఏ., సెక్రటరి.



ప్రకటన

శ్రీ వెంకటేశ్వర్ పేపరు అండ్ స్ట్రాబోర్డు మిల్సు లిమిటెడ్, తిరుపతి.

వాటాదారులకు నోటీసు

దిగువ కార్యక్రమము జరుపుటకు కంపెనీయొక్క 9-వ వార్షిక సర్వసభ్య సమావేశము తిరుపతి నెం 139 కేసాచలయ్య వీధియందలి కంపెనీ రిజిస్టరు ఆఫీసునందు 1949-వ సం|| డిసంబరు 25-వ తేది ఆదివారము సాయంత్రము 8-0 గంటలకు జరుగునని యిందుమూలముగా తెలియజేయడమయినది.

1. 1949-వ సం|| మార్చి 31-వ తేదితో అంతమగు సంవత్సరమునకు డైరెక్టర్ల నివేదికయును, ఆడిటుకాబడిన బ్యాలెన్సుషీటును, లాభనష్టముల లెక్కయును అందుకొని ఆమోదించుట.
2. విరమించుచున్న డైరెక్టర్ల స్థానే డైరెక్టర్లను యెన్నుకొనుట.
3. ప్రస్తుత సంవత్సరమునకు ఆడిటర్లను యెన్నుకొని వారి పారితోషికము నిర్ణయించుట.
4. ఛైర్మన్ అనుమతించు కంపెనీకొలూకు ఏవయిన యితర సాధారణ కార్యక్రమము జరుపుట.

కంపెనీ ట్రాన్సుఫర్ పుస్తకము లు 1949-వ సంవత్సరము డిసంబరు 15-వ తేది నుండి 1950-వ సం|| జనవరి 4-వ తేదివరకు (రెండురోజులు సహా) మూసియుంచబడును.

బోర్డువారి అనుమతిని

For శ్రీ వెంకటేశ్వర్ పేపరు అండ్ స్ట్రాబోర్డు మిల్సు లిమిటెడ్.

For పణ్యం బ్రదర్సు లిమిటెడ్.

(సం) పి. వి. సుబ్రహ్మణ్యం, మేనేజింగ్ డైరెక్టరు, మేనేజింగ్ ఏజంట్లు.



స్వర్ణోత్సవ వికాసము నర్తనశోభ

Golden Jubilee 1896-1946

ఎం.డి.జి. గోపాలాచార్యులవారి జీవామృతము

"జీవామృతము"

ఆయుర్వేదాశ్రమం లిమిటెడ్ (స్థాపితము 1896) మద్రాసు-17


## ప్రొద్దుటూరు ఫిర్కా అభివృద్ధిసంఘ సమావేశం

### వివిధ శాఖల కార్యక్రమ సమీక్ష

ప్రొద్దుటూరు, నవంబరు 22: ఈ ఫిర్కా అభివృద్ధి సంఘంవారు నిన్న కడపజిల్లా కలెక్టరు బి. మాధవరావుగారి అధ్యక్షతను సమావేశమైనారు. జిల్లా వ్యవసాయ డిమాన్‌స్ట్రేటరు సత్యనారాయణగారు ఈ ఫిర్కాలో ప్రత్యేక కార్యక్రమం క్రింద 3223 యకరములు వరి, 1000 ఎకరాలు రాగి 7280 ఎకరాలు వేరుశనగ, 900 ఎకరాలు జొన్న సాగుబడి అవుతోందన్నారు. ఇంకా యెక్కువ, సత్తువైన పంట పండించడానికి సత్తువైన విత్తనాలు కొనుక్కొని నాటుకోవాలనీ, అమ్మోనియం సల్ఫేటు వగైరా ఎరువులు ఈ సంవత్సరం వచ్చే నమ్మకంలేదు కనుక పచ్చిఆకు ఎరువులు యెక్కువగా పెంచి భూమికి సత్తువ చేసుకోవాలని చెప్పారు ఈ ఫిర్కాలో చాటి భూమి యెక్కువగా యున్నదనీ, దానిని సారవంతం చేయడానికి పచ్చిఆకు ఎరువులే మంచివన్నారు. వ్యవసాయ శాఖ ఆఫీసులోయున్న వరివిత్తనాలు కొనుక్కొని వినియోగిస్తే మంచిపంట వస్తుందన్నారు. పైరుకు తెగులు, చీడపురుగు పట్టితే కావలసిన మందు తమ ఆఫీసులలో సగం ఖరీదుకే దొరుకుతుందని చెప్పారు. తరువాత జిల్లా పశువుల డాక్టరుగారు, తామింకా త్వరగా ఒక కాంపౌండరుని నియమించినారని, అతడు తరుచుగా ఫిర్కాలోయుండే పల్లెలకు పోయి పశువులకు వచ్చినజబ్బులు నివారణచేస్తాడని ఈ సంవత్సరంలో అతడు 960 పశువులకు చికిత్సచేశాడన్నారు. జిల్లా విద్యాశాఖాధికారి నిర్బంధప్రాథమిక వయోజనవిద్య యేవిధంగా అనుభవంలోకి రావటంలేదో చెప్పారు. ఇందుకు ఫిర్కాలో 8 స్కూళ్ళున్నాయని మార్చి 30 వ తేదీకి యింకా 30 మంది ఉపాధ్యాయులు కావాలనీ వారికి శిక్షణ యిస్తున్నామనీ అన్నారు. కె. బాలనారాయణరెడ్డి (ఎం. ఎల్. ఏ.)గారు వ్యవసాయశాఖవారు రైతులకు ఊరికే చెప్పేకన్న ప్రత్యక్షంగా ఎరువులయొక్క విలువ ప్రదర్శించిచూపిస్తే బాగుంటుందన్నారు. రావులమునిరెడ్డి, ఎల్. జేని యల్‌గార్లు కుటీరపరిశ్రమల అభివృద్ధికి కొన్ని సలహాలిచ్చారు. ఫిర్కా అభివృద్ధి అధికారి బి. రామశాస్త్రిగారు సెప్టెంబరు, అక్టోబరు నెలలలో వారుచేసిన కార్యక్రమం నివేదించిరి. అధ్యక్షుడు సత్తువైన విత్తనాలు సేకరించి, వాటిని అమ్మేందుకు ఒకకమిటీని నియమించవలెననిన్నారు, చెప్పులు తయారుచేయుటకు కోఆపరేటివు సొసైటీలు స్థాపించవలెనని ప్రత్యేక అభివృద్ధిఅధికారికి సలహా ఇచ్చారు. వయోజన, నిర్బంధప్రాథమిక విద్యలు అభివృద్ధిపొందడానికి రెవెన్యూ డివిజనల్ ఆఫీసరును, జిల్లావిద్యాశాఖాధికారికి సహాయంచేయమని సలహాఇచ్చారు. తరువాత డి. కె. వర్మగారు ఫిర్కాలో 4 వేల చేనేతమగ్గాలున్నాయనీ ఈవృత్తిపైన ఆధారపడియున్న వారికి పనులులేవనీ అధమపక్షం 500 మగ్గాలకైనా పనికలుగచేస్తే బాగుంటుందనీ ఫిర్కాకువచ్చే 150 బేళ్లు మిల్లుగుడ్డలను రాకుండాచేస్తే చేనేతవారికి పనికలుగుతుందనీ అన్నారు. అధ్యక్షుడు ఈ విషయమై ప్రభుత్వానికి వ్రాస్తామన్నారు.

స్థానిక చేనేతపారిశ్రామిక సంఘ వార్షికోత్సవము మొన్న ఆరవ పెద్దనాగముసెయ్యగారి అధ్యక్షతను జరిగింది. జింకా వెంకట సుబ్బయ్యగార్లు చేనేత పనివారు, చేనేత పరిశ్రమ యేవిధంగా దెబ్బతింటోందో వివరించారు. డి.కె.వర్మగారు చీరాలలో చేనేత కాంగ్రెసు చేసిన తీర్మానాలను వివరించారు. మిల్లుగుడ్డలు తక్కువ నెంబర్లలో తయారుచేయరాదని, ఫలానాఫలానా నెంబరు గుడ్డ మగ్గములపైన తయారుచేయాలని ప్రభుత్వాన్ని కోరుతూ తీర్మానము తీర్మానించినారు. ప్రొద్దుటూరునుండి యర్రగుంట్ల పోయేదారిలో పెన్నానదికి వంతెనకట్టాలని, నిలిచిపోయిన ప్రొద్దుటూరు పవర్ అండ్ లైటు లిమిటెడ్‌ను వెంటనే ప్రభుత్వం స్వాధీనపరచుకొని ప్రజలకు విద్యుచ్ఛక్తి సరఫరా చేయాలని ప్రభుత్వాన్ని కోరుతూ తీర్మానములు చేశారు.

మోసగాడు పట్టుబడుట

స్థానిక హైస్కూలుకు చెందిన వి. శేషాచార్లుగారు, తమకు కంట్రోలు ఖరీదుకు సక్కెర తీసికొని పంపిస్తానని రూ. 10/- లు తీసికొని మరి కనపడకుండాపోయిన వ్యక్తిని నిన్న పట్టుకొన్నారు. ఈ వ్యక్తి ఒక బట్టు, మునసాబు యింట్లో జీతగాడని యింకొందరితో పంచదార, కిరసనాయిలు, నగలు కంట్రోలు రేటుకు తెచ్చిపెడతానని చెప్పి నమ్మించి డబ్బులు తీసికొంటున్నట్లు తెలియుచున్నది.

## ఆచార్య రంగాగారికి రాజాజీ తంతి

### వేరే తుపానునిధి స్థాపన యుక్తంకాదని వర్తమానం

విజయవాడ, నవంబర్ 23: ఆంధ్ర తుపాను సహాయనిధిని మద్రాసు గవర్నరు ఇదివరకే ప్రారంభించివున్నారు కనుక, వేరే మరొకనిధిని ప్రారంభించటం యుక్తంగావుండదని గవర్నర్ జనరల్ రాజగోపాలాచారిగారు అభిప్రాయపడుతున్నట్లు ఆం. రా. కాం. అధ్యక్షుడు ఆచార్యరంగాగారికి రాజాజీ కార్యదర్శి ఒక తంతివార్త పంపారు.

ఇటీవల తుపానువల్ల నష్టపడిన బాధితులసహాయమునకు నిధిని ప్రారంభించే విషయమై రంగాగారు నవంబరు 8 వ పంపిన తంతికి సమాధానంగా పైవర్తమానం వచ్చింది. స్వ. వి.

## సోషలిస్టుపార్టీ ప్రచారం: ప్రముఖుల పర్యటన

భీమవరం, నవంబరు 22: అఖిలభారత సోషలిస్టుపార్టీ కార్యవర్గసభ్యులు కామ్రేడ్ (ప్రేమభాసిన్, కేశవగోరే, రాష్ట్ర) జిల్లా సో. పా. కార్యదర్శులు చక్రధర్, నారాయణమూర్తిగార్లతో యిచ్చటికి వచ్చారు. స్థానిక యంగ్ సోషలిస్టు లీగువారు బహిరంగ సభ యేర్పాటు చేశారు. చక్రధర్ సభకు అధ్యక్షత వహించారు. కేశవగోరే యువకులంతా సోషలిస్టుపార్టీని బలపర్చవలెననీ పార్టీ నియమావళినిసరించి ఉపన్యసించారు. ప్రేమభాసిన్ యంగ్ సోషలిస్టు లీగునుగురించి-అందు యువకుల పాత్రనుగూర్చి - ఉపన్యసించారు. స్థానిక యంగ్ సోషలిస్టు లీగుకార్యదర్శి బోయుడు సుబ్బారాయుడుగారి అభినందనలతో సభ ముగిసింది. స్వ. వి.

### తాడేపల్లిగూడెం

తాడేపల్లిగూడెం, నవంబరు 22: సోషలిస్టుపార్టీకి చెందిన ప్రేమభాసిన్, కేశవగోరే, చక్రధర్‌గార్లు నేడు ఇచ్చటకు వచ్చారు. స్థానికసోషలిస్టుపార్టీ సభ్యుడు వరదా బ్రహ్మానందం ప్రభృతులు వారికి స్వాగత మిచ్చారు. బ్రహ్మానందంగారు చేసిన అల్పాహారవిందులో పాల్గొని వారు భీమవరం వెళ్లారు. స్వ. వి.

## చోరీసొత్తు పత్తాదొరుకుట: ముగ్గురి అరెస్టు

పెనుగొండ, నవంబరు 20: గతమాసం 19-వ తేదీన స్థానికవర్తకుడు మైలవరపు ఆదిశేషయ్య యింట జరిగిన చోరీ సందర్భమున పోలీసువారు మొన్న బుక్కపట్టణములో కొరివ అబ్బులయ్య, నారాయణ, అయ్యప్ప అనువారిని అరెస్టుచేసి, నిన్న స్థానిక స్టేషనరీ సబ్ మేజస్ట్రేటు కోర్టులో హాజరు పరచిరి. మేజస్ట్రేటుగారు నిందితులకు-జామీను నిరాకరించి 15 దినములు రిమాండులో నుంచవలెననీ ఉత్తరువు చేసిరి. సుమారు రూ. 3000/-లు విలువ గల చోరీసొత్తు పత్తా చేయబడినట్లు తెలిసినది. దర్యాప్తు ఇంకా జరుగుచున్నది. (స్వ. వి.)

## వీటుకూరి నరసయ్య స్మారక నిధి

నిడుబ్రోలు, నవంబర్ 20: కవిబ్రహ్మ స్మారక నిధి సంఘము కోశాధికారి పాములపాటి బుచ్చినాయుడుగారిట్లు వ్రాసిరి:—

న్యూఢిల్లీ నుండి శ్రీ ఎన్. జి. రంగాగారు వెంకటనరసయ్యగారి కుటుంబమునకు సానుభూతి తెలుపుచు, స్మారక నిధికి వందరూపాయలు పంపారు.

ఈ నిధికి స్థానిక పెద్దల అధ్వర్యమున చురుకుగా వసూళ్లు జరుగుచున్నవి.

ఇప్పటికి వచ్చిన విరాళములు:— గోగినేని రంగనాయకులు రూ. 100/-, భారతీ దేవి రూ. 50/-, పాములపాటి బుచ్చినాయుడు రూ. 250/-, వెంకట సుబ్బమ్మ రూ. 250/-, దుర్గా రైస్‌మిల్ యజమానులు రూ. 100/-, వెంకటేశ్వర రైస్‌మిల్ యజమానులు రూ. 100/-, సువర్ణ కాళికా రైస్‌మిల్ యజమానులు రూ. 100/-, సత్యనారాయణ రైస్‌మిల్ యజమానులు రూ. 100/-, కోసరాజు నాగయ్య రూ. 25/-, ఇంటూరి అప్పయ్య రూ. 25/-, మన్నెం వీరాస్వామి రూ. 25/-, దప్పపాటి రంగనాయకులు రూ. 40/-, కోసరాజు కృష్ణయ్య రూ. 25/-, ధూళిపాళ్ళ పట్టయ్య రూ. 25/-, ధూళిపాళ్ళ వీరయ్య రూ. 10/-, ధూళిపాళ్ళ బసవయ్య రూ. 10/-, మూల్పూరి గోవిందరాజులు రూ. 10/-, పెదిరెడ్డి రామయ్య రూ. 10/-, పోతూరి వెంకయ్య 20/-, శాతా అంకయ్య అండ్ సన్స్ రూ. 116/-.

## ఆంధ్ర తుపాను నిధి

ద. ఇ. ఫెల్సు చేంబరు అధ్యక్షులు టి. ఆర్. సుందరం గారు ఆంధ్రదేశంలో కలిగిన తుపానునష్టము గూర్చి వివరించుచు, అందువల్ల నష్టపోయిన వారికి విరివిగా ఫిల్ము పరిశ్రమలో నున్నవారంతా చందాలివ్వాలని, ఫిల్మ్‌రిలీఫ్ కమిటీ స్థాపించబడినదనియూ, దానికంపరు ... తోడ్పడవలెనని, కోరుచు ప్రకటించిరి. ఇందుకొరకు సంబంధించిన చందాలను రాబడి పన్నునుండి తొలగించవలెనని ప్రభుత్వం వారిని కోరుచున్నారు.

మదరాసు పేసు గుడ్సు వర్తకుల సిండికేటు వారు ఆంధ్ర తుపాను నిధికి రూ. 264-5-0, కాందిశీకుల నిధికి 234, శాలభంజులకు 100 చందా యిచ్చిరి.

బి. సి. గోవిందుగారు, మదరాసు హరిజననాయకుడు, ఆంధ్ర దేశంలో తుపానువల్ల బాధపడిన హరిజనులందరికి తోడ్పడవలెనని హెచ్చరించుచు, మదరాసు హరిజనులందరికి విన్నపము ప్రకటించిరి.

25 తే. 6 గ. పెరమాళ్ కోయిలవీధి యందు, జాస్తి టవున్‌లో ఆంధ్ర హరిజన సంఘం సభ బి. లక్ష్మీనారాయణగారి అధ్యక్షతన జరుగును.

## ఐక్యరాజ్య సమితి వరదనిరోధ సంఘం

### కృష్ణా, గోదావరి డెల్టాలలో పర్యటన

విజయవాడ, నవంబరు 23: ఐక్య రాజ్యసమితి తాలూకు ఆసియా దూర ప్రాచ్య ఆర్థిక సంఘానికి చెందిన వరద నిరోధ ఉపసంఘ సభ్యులు ముగ్గురు 25-వ తేదీన ఇక్కడికి వచ్చెదరని తెలిసినది. వీరు కృష్ణా, గోదావరి డెల్టాలలో వరద నిరోధ ఏర్పాట్లు, మురుగు, సాగు పారుదల సౌకర్యాలు పరిశీలించెదరనికూడ తెలిసింది. ప్రస్తుతం మనదేశం వివిధ ప్రాంతాలలో పర్యటిస్తున్న ఈ ముగ్గురికీ డాక్టర్ షెన్ అనే ఆయన నాయకుడు. మిగతా ఇద్దరిలో ఒకరు భారతీయుడైన వి. కె. కపూర్. విజయవాడ సూపరింటెండింగ్ ఇంజనీరు జి. నరసింగరావుగారు చీఫ్ ఇంజనీర్ ఆనతిపై, 25 నుంచి 30 వరకూ వీరి పర్యటన కార్యక్రమం నిర్ణయించుచున్నారు. వారే వీరివెంటవుండి అన్ని చూపించెదరు. వీరు ఒకరోజు ధవళేశ్వరంవద్ద గోదావరి ఆనకట్ట చూచెదరట. బుధమేరు కాల్వల ప్రాంతాలకు కూడ వెళ్ళుటకు కార్యక్రమం ఏర్పాటు అగుచున్నది. మనదేశంలో వీరి పర్యటన ఈ ప్రాంతాలు చూడటంతో పూర్తి అవుతుంది. ఇక్కడ్నుంచి వీరు మద్రాసు మీదుగా కొలంబో వెళ్ళెదరు. (స్వ. వి.)

## హరిజన విద్యార్థులకు వసతిగృహ నిర్మాణం

### విజయవాడపురపాలకసంఘ తీర్మానం

విజయవాడ, నవంబరు 22: ఈ పురపాలకసంఘంవారు నిన్న సమావేశమై, ఇక్కడి పాఠశాలలోను, కళాశాలలోను గల హరిజన విద్యార్థుల సౌకర్యార్థం ఒక వసతి గృహం ఏర్పాటుచేయుటకును, ఇందుకు బడ్జెటులో అవకాశం కలిగించవలెనని కమీషనరును కోరుచును తీర్మానించిరి. సమావేశమునకు చైర్మను టి. వి. ఎస్. చలపతిరావుగారు అధ్యక్షత వహించిరి. మునిసిపల్ హైస్కూళ్లు రెండింటిలో రెండుకేడిమోలు పెట్టుటకు మంజూరుచేస్తూ కూడ తీర్మానించిరి. గాంధీనగర్‌లో బ్రాంచి పోస్టాఫీసు పెట్టవలెనని, ఇక్కడ విమానములు ఆగునట్లు చేయవలెనని, అధికారులను కోరుచు తీర్మానించిరి. భ్రమరాంబా మల్లేశ్వర ఆంధ్రగ్రంథాలయానికీ, హిందూస్థాన్ స్కౌట్ అసోసియేషనుకు చెరొక రూ. 116 లు విరాళములు మంజూరు చేసిరి.

అఖిలభారత హిందీ పరిషత్తులో పాల్గొనుటకు ఉన్నవ రాజగోపాలకృష్ణయ్య, శిష్ల బ్రహ్మయ్య, జె. ఆంజనేయ శర్మ, డి. శ్రీనివాస అయ్యంగారు కనివారంగనాడు ఢిల్లీ వెళ్లిరి.

## శ్రీ సద్గురు సచ్చిదానందేంద్ర సరస్వతిస్వామి నిర్యాణము

తెనాలి, నవంబరు 21: శ్రీ మత్పరమహంస సచ్చిదానందేంద్ర సరస్వతి స్వామివారు సమాధినిష్ఠచేసి ఈ నెల 15-న అనంతరంలో శ్రీహరీ, శ్రీహరీ, యనుచూ దేహయాత్రను చాలించిరి. పూర్వాశ్రమములో నీరిపేరు మల్లాది హనుమచ్ఛాస్త్రి. వలివేలు వాస్తవ్యులు. చిన్నతనమందు కావ్యతర్క అధ్యయనం చేసి, తిర్వాత మెట్రిక్యులేషన్ వరకు ఇంగ్లీషువిద్య నభ్యసించిరి. కొంతకాలము బ్రహ్మసమాజ సిద్ధాంతముల నవలంబించిరి. శ్రీ బ్రహ్మానందస్వామివారు బాపట్లలో నుండగా 32 సంవత్సరములక్రిందట వారి వద్ద ఉపనిషద్భాష్యములన్నియూ జదివి వారికి ప్రియశిష్యులైరి. 1921 వ సంవత్సరములో సన్యసించి వేదాంతవిచారణ గావించుచూ చిరకాలము అనంతవరంలో నివసించిరి. వారి దర్శనముకొరకు ఎవరు వచ్చిననూ వారిని తమయొక్క రూపాంతరముగానె దర్శించుచూ తమతో తాము తమలో తాము సంభాషించుచున్నట్లుగా సంభాషించుట వారికి పరిపాటి.

## ఆంధ్ర విశ్వవిద్యాలయ సెనేట్ ఎన్నికలు

### ప. గో. నుండి కాంగ్రెస్ అభ్యర్థిగా జగన్నాధరాజుగారి నియామకం

విజయవాడ, నవంబర్ 23: ఆంధ్ర విశ్వ విద్యాలయ సెనేట్ ఎన్నికలకు పశ్చిమ గోదావరి స్థానిక సంస్థల కాంగ్రెసు అభ్యర్థిగా భీమవరం కౌన్సిలర్ జి. జగన్నాధరాజుగారు నియమింపబడినారని, ఆ జిల్లాలో అభ్యర్థిత్వం కోసం దరఖాస్తు పెట్టిన మిగతా వారు ఉపసంహరించుకొని కాంగ్రెస్ అధికార అభ్యర్థి విజయం కోసం ప్రయత్నించవలసిందని రాష్ట్ర కాంగ్రెస్ కార్యదర్శి కె. ఓబుల రెడ్డిగారు ప్రకటిస్తున్నారు.

### ప. గో. జిల్లా స్థానికసంస్థల స్థానమునకు అభ్యర్థులు

ఏలూరు, నవంబరు 23: ప. గోదావరి జిల్లాలోని స్థానిక సంస్థల తరపున ఆంధ్ర విశ్వకళాపరిషత్తు సెనేటుకు ఎన్నుకొనవలసిన స్థానమునకు రిటర్నింగ్ ఆఫీసర్ జనాబ్ షేక్ అహమ్మదు ఎదుట బుద్ధిరాజు రాజభూషణరావు పెద్దిరెడ్డి సత్యనారాయణ జి. జగన్నాధరాజు, కనిదొళ్ళ జనార్దన గుప్తగార్లు నామినేషనులుదాఖలు చేసిరి. (స్వ. వి.)

### ఆంధ్రవిశ్వకళాపరిషత్తుకు చిత్తూరుజిల్లా సభ్యులు

తిరుపతి, నవంబరు 22:— చిత్తూరు జిల్లా బోర్డు చిత్తూరు-తిరుపతి మునిసిపాలిటీల పక్షమున ఆంధ్ర విశ్వకళాపరిషత్తునకు ఎన్నుకొనబడవలసిన ఇద్దరు సభ్యులకుగాను డి. మునిరత్నంనాయుడు, కట్టమంచి విజయసింహారెడ్డిగారలు ఎన్నుకోబడిరి. (స్వ.వి.)

### నెల్లూరుజిల్లానుంచి ఎన్నిక

వాకేరు, నవంబరు 22: నెల్లూరు జిల్లా స్థానిక సంస్థల నియోజక స్థానంనుంచి ఆంధ్రవిశ్వకళాపరిషత్ సెనేటుకు బెజవాడ రెడ్డి లక్ష్మీరెడ్డిగారు ఎన్నిక అయిరి.

## చీరాలలో స్ఫోటకం వ్యాప్తి

చీరాల, నవంబరు 21: ఈ వూరిలో స్ఫోటకం వ్యాపిస్తున్నది. ఇటీవల మరి 17 గురికి సోకి ముగ్గురు మరణించినట్లు తెలిసినది. వ్యాధి నిర్మూలనమునకు స్థానిక ఆరోగ్యశాఖవారు పనిచేయుచున్నారు. ప్రజలకు టీకాలు వేయుచున్నారు.

### పత్రికా రచయితల సంఘసభ

స్థానిక పత్రికారచయితల సంఘసభ నిన్న ఆర్ డి. సాధంగారి అధ్యక్షతను జరిగినది. ఆంధ్రరాష్ట్రమునకు చీరాలను ముఖ్యపట్నంగా చేయవలెనని భారత ప్రభుత్వాన్ని కోరుచూ తీర్మానించిరి.

తుపానువలన ఆంధ్రదేశములో నష్టపడినవారికి, సంతాపమును దెల్పుచూ, వారి సహాయమునకుగాను ఏర్పాటుఅయిన నిధులకు యథాశక్తిన సహాయము చేయవలెనని భారతదేశములోని పత్రికారచయితలకు, రచయితల సంఘములకు, పత్రికలకు విజ్ఞప్తిగావించుచూ, యింతవరకు తుపాను బాధితుల సహాయార్థము విరాళములు, యిచ్చినవారికి, విరాళములు సేకరించుటకు పాటుబడినవారికి ధన్యవాదము లర్పించుచూ మరొక తీర్మానంచేసిరి.

## ప. గో. జిల్లా తెలగసంఘ స్థాపన

తాడేపల్లి గూడెం, నవంబరు 19: పశ్చిమ గోదావరి జిల్లాలోని తెలగకులానికి చెందిన ప్రముఖులు నేడు పసల సూర్యచంద్రరావుగారి భవనంలో సమావేశమై, జిల్లాసంఘాన్ని స్థాపించారు. దీనికి జవ్వాదిలక్ష్మయ్యగారు అధ్యక్షుడుగాను, పెద్దిసెట్టి సత్యనారాయణగారు కార్యదర్శిగాను, గ్రంధి వెంకటరెడ్డి నాయుడుగారు కోశాధికారిగాను, మరి 49 గురు సభ్యులుగాను ఎన్నిక అయిరి.

వెనుకబడిన జాతులసంఘపు సమావేశమొకటి రాజున శ్రీరామమూర్తిగారి అధ్యక్షతను ఇటీవల కైకరంలో జరిగెను. సుమారు 100మంది ప్రతినిధులు సభకు హాజరైరి. వాసంశెట్టి మనోహరం, గద్దాడ వెంకన్న, గుత్తుల సింహాద్రి గార్లు యీ సంఘమునకు ప్రభుత్వము చేయుచున్న సహాయమును ప్రశంసించుచు మాట్లాడిరి.

తాడేపల్లి గూడెంలో యిటీవల ఉత్పత్తి దారుల సహకార కోఆపరేటివ్ సొసైటీని అర్బన్ బ్యాంకుగా మార్చియుండిరి. మొన్నటినుంచి యీ కొత్త అర్బన్ బ్యాంకు పనిచేయుచున్నది. ఈ బ్యాంకు అధ్యక్షునుగా కలిదిండి సుబ్బరాజుగారు ఎన్నుకోబడిరి.

ఆంధ్రసహిన్మ మత్స్య పారిశ్రామిక సంఘ ద్వితీయమహాజనసభ నవంబరు 30 వ బందరు తాలూకా లక్ష్మీపురంలో పెద వీరరాఘవయ్యగారి అధ్యక్షతను జరుగును.

## రాష్ట్ర అసెంబ్లీ ప్రశ్నోత్తరములు

### ఆడపోలీసుల నియామకం ప్రస్తుతానికి వాయిదా

సభానాయకుని ప్రకటన

చెన్నపట్నం, నవంబరు 24: మద్రాసు అసెంబ్లీ నేడు ప్రశ్నోత్తరముల కాలమున ఆడపోలీసులను నియమించు ఆలోచన ఇప్పటికి వాయిదా వేయబడెనని సభానాయకులు బెజవాడ గోపాలరెడ్డిగారు ఒక ప్రశ్నకు సమాధానముగా తెలిపిరి.

చెన్నరాష్ట్రములో ఆడపోలీసులను నియమించుసందర్భమున ఇతర రాష్ట్రములకు వ్రాసి తెలుసుకొనలేదనియు, అది ఒక భోగమనియు సభానాయకులు గోపాలరెడ్డిగారు బేగం అమీరుద్దీన్ గారికి తెలిపిరి. భోగమెట్లగునగా అవసరముకానిది, అదనపుఖర్చు అగునది అని మంత్రిగారు నిర్వచించిరి.

శ్రీ వరదేశన్:-అందమైన స్త్రీలు వీధులలోకివచ్చుట మంత్రిగారికి ఇష్టము లేదా?

స:-మనము ఇచ్చుజీతమునకు అందమైనవారెందరు వత్తురో నేను చెప్పజాలను.

శ్రీ అనంతాచారి:-ప్రేమ అను గారడీ కర్రతో జవాన్ని అదుపులో ఉంచగల శక్తి గల స్త్రీలు పోలీసు దళమునకు అవసరంలేదా?

స:-ఎంతవరకు ప్రయోజనకరమగునో పరిశీలింపవలసి ఉన్నది.

శ్రీ తెన్నేటి విశ్వనాథం:-స్త్రీలకు, గృహములను శోధించుచున్న ఈ సమయమున స్త్రీ అధికారులుండుటవ్యాయముగాదా!

స: మామూలు పోలీసులు చాలును.

మజీద్‌గారు: ఆధునిక నాగరికతగల దేశములలో కొన్ని కొన్ని దర్యాప్తుల సందర్భమున స్త్రీలుండుట హెచ్చు ప్రయోజనకరమని తలంచుటలేదా?

స: ఇతర దేశములసంగతి నాకు తెలియదుగాని, తిరువనంతపురంలో నేను చూచి కనుక్కున్నప్పుడు ఆడకైదీలవెంట పోవుటవరకప్ప అంతకన్న ప్రయోజనకరము పనులు వారు చేయుటలేదనివింటిని.

బేగం అమీరుద్దీన్: వారు చాలా ప్రయోజనకరముగా ఉన్నారని వెనకటి ఐ. జి. వ్రాసిన అభిప్రాయమును మంత్రిగారు తిలకించెదరా అని మంత్రిగారికి చీటి పంపగా వరదేశన్‌గారు అటుల ఒక సభ్యురాలు మంత్రిగారికి ఉత్తరములు పంపవచ్చునా అని ఆక్షేపించిరి) మంత్రిగారు తాము స్వయముగా తెలుసుకొన్న అభిప్రాయము భిన్నముగా ఉన్నదనిరి.

### వైద్య విద్య

49-1950 నుంచి రెండేళ్ళవరకు ఆరు ఉచిత విద్యావేతనములు హిందూ బాలికలకు వైద్య విద్యాభ్యాసమునకు ఇవ్వబడుననియు, ముస్లింబాలికలకు అర్ధవేతనములు క్రయిస్తవులకు, హరిజనులకు ఉచితవిద్య గరపబడుచున్నదని వైద్యమంత్రి డాక్టరు రాజన్‌గారు అమీరుద్దీన్‌గారికి తెలిపిరి. వితంతువులకు జీవనవృత్తికి ఉచితవిద్యనిచ్చెదరా అని విశ్వనాథంగారు అడుగగా మంత్రిగారు సమాధాన మివ్వలేదు.

1949 లో విద్యుత్ కార్యక్రమమునకు లైసెన్సులు ఇవ్వలేదని ఇస్మయిల్‌గారికి పబ్లిక్ వర్క్సుమంత్రి తెలిపిరి.

వేదరత్నంగారికి సమాధానముగా సాంఘిక విద్యకు 1.57 లక్షలు కేంద్ర ప్రభుత్వం సహాయము చేసెనని దానిని ప్రాథమిక విద్యకు వినియోగించెదరని విద్యామంత్రి తెలిపిరి.

రజాఖాన్‌గారు: విద్యాశాఖా డైరెక్టరుకైనా ప్రాథమిక విద్య అంటే తెలుసునా?

స: వారినే అడిగిచూడండి.

రజాఖాన్‌గారు అందుకు ఆక్షేపణ తెలుపుతూ అధ్యక్షులు తమను రక్షింపవలెననియు, మంత్రిగారికి అట్టి సమాధానం ఇచ్చు హక్కు లేదనియు తెలిపిరి. దానికై మంత్రిగారు గౌరవసభ్యునిమాట అవమానకరముగ నున్నదనియు తామంత మర్యాదగా సమాధాన మిచ్చినందుకు గౌరవసభ్యులు తమ అదృష్టమును పొగడుకొనవచ్చుననిరి.

మొహిద్దీన్‌కుట్టి: మంత్రిగారికే ప్రాథమిక విద్యఅన్న తెలియదని ఒక పత్రిక వ్రాసినదాన్ని చదివినారా?

స: అప్పటికి నాకు దానిసంగతి సాకల్యంగా తెలియదని నేనే చెప్పినమాట నిజమే.

### ముష్టివారు

ఓధులలో ముష్టి నిషేధించుచూ సిటీ పోలీసు ఆక్టు 71 వ సెక్షను అనులులో ఉన్నది అని లా శాఖ మంత్రి మాధవ మీనన్‌గారు ఇస్మయిల్‌గారికి సమాధానంగా చెప్పిరి. సన్యాసులకు, ఫకీరులకు అది వర్తించునో వర్తించదో తెలుపుట కష్టమనిరి. స్థానికసంస్థలు ముష్టివారికి ఆశ్రయములు పెట్టినపుడు ప్రభుత్వంసానుభూతితో ఆలోచించుననిరి. ఆ కొరకు సరిగా పనిచేయుట లేదన్న ఆరోపణలకు కారుణ్యభావం గల మనదేశంలో ఎన్నటికీ అది పూర్తిగ అమలు జరుగుట కష్టమనియు మంత్రిగారు తెలిపిరి.

కాకినాడ మున్సిపల్ రిజర్వాయరుకు సామర్లకోట లాకులవద్ద 100 ఎకరాల పల్లపుభూమి ప్రభుత్వం తీసుకోవలెనని ప్రతిపాదన ఉన్నదిగాని అది తీసుకొనబడెనో లేదో తమకు తెలియదనియు, ప్రత్యామ్నాయముగా రైతులు చూపిన స్థలము అందుకు పనికిరాదని తనిఖీపై తెలిసెననియు ఆరోగ్యమంత్రి డా|| రాజన్‌గారు ఇస్మయిల్‌గారి ప్రశ్నకు సమాధానముగా తెలిపిరి.

రాళ్లపాడు ప్రాజెక్టు నివృత్తియోజకమని తలంచుటలేదని మదమ్మకు ఇలాకా మంత్రి రాఘవయ్యగారు ప్రశ్నకు సమాధానముగా తెలిపిరి.

### రాయలసీమ అభివృద్ధి

రాయలసీమ అభివృద్ధికి ఒక సంఘము నియమింపబడెననియు, రెండేళ్లు అది అములులో ఉండుననియు, డెవలప్‌మెంటు కమిషనరు సూచించిన ప్రాజెక్టులను వారు ఆలోచింతురనియు ఆర్. వి. స్వామినాథన్‌గారికి రెవెన్యూమంత్రి తెలిపిరి. వెనకబడ్డ ఇతర ప్రాంతములకు బోర్డులను నియమించెదరా అనగా సమాధానములేదు.

దినసరి పత్రికకు రూ 1,75,000 లు ప్రభుత్వంవారు పరిశ్రమల చట్టం క్రింద ఋణము మంజూరుచేయలేదని రెవెన్యూ మంత్రి సలాంగారి ప్రశ్నకు సమాధానముగా తెలిపిరి.

### ఖద్దరు వర్తకం

1949 మద్రాసు ఖద్దరువృద్ధి ఉత్తర్వు క్రింద లాభంవిడుదల ప్రభుత్వం హెచ్చు చేయలేదనియు, ఆంధ్ర రాష్ట్ర ఖాదీ వ్యాపారస్థుల కాంగ్రెసు సంఘం అటుల కోరినమాట నిజమని సలాంగారికి సమాధానంగా గ్రామోద్ధరణ మంత్రి తెలిపిరి.

### నిమ్నజాతుల క్షేమసంఘం

నిమ్నజాతుల క్షేమసంఘానికి ఒక సలహాసంఘం నియమింపబడెనని గ్రామోద్ధరణ మంత్రి పరమేశ్వరన్‌గారు, స్వామినాథన్‌గారికి సమాధానముగా తెలిపిరి.

రకొబ్ఖాన్‌గారు: ముస్లింలు, క్రయిస్తవులు అందురారా?

స: రారు. మతం పుచ్చుకున్న క్రయిస్తవుల సంగతి, ఆలోచిస్తున్నాము.

ప్ర: మరి ఆసంఘ ప్రతినిధులెందుకు వేయలేదు?

స: అప్రకారమైతే 138 కులాలవారిని అందుచేర్చవలెను.

హమీద్‌ఖాన్‌గారు: నిమ్న జాతులెవరు?

స: బ్రాహ్మలు, కొందరు మొదల్యార్లు, రెడ్లు, నిమ్న జాతులక్రింద రారు. విద్యావిషయికంగా వెనకబడిన జాతులు యిందు వచ్చెదరు.

శ్రీమతి లక్ష్మీఅమ్మాళ్: బ్రాహ్మణులలో గూడా వెనకబడిన కుటుంబాలవారు లేరా?

స: ఉన్నారు.

మజీద్‌గారు: పన్నెండుగల క్షత్రియులు కాంగ్రెసును దక్షిణాదిన ఓడించి నందున వారిని నిమ్నజాతుల సంఘంనుంచి తప్పించుచున్నారన్న వార్త విన్నారా?

స: అది మతవిభేదముల రెచ్చగొట్టసంకించు రాజకీయవేత్తల దుష్ప్రచారం మాత్రమే.

## తియొలాజికలు హైస్కూలు రత్నోత్సవం

చెన్నపురి హిందూ తియొలాజికల్ హైస్కూలు ప్రధానోపాధ్యాయ శ్రీ యస్. బాలకృష్ణజోషిగారు ఇట్లు వ్రాయుచున్నారు:-

"పాశ్చాత్య మతాచారముల ప్రాబల్యముచే మనదేశపు యువజనమును రక్షింపవలయునను ఉన్నతాశయముతో స్థాపింపబడినపై పాఠశాల ప్రజోపయోగముగ అఱువదియేండ్లు వర్ధిల్లినది. ఈ అఱవది యేండ్లలో వేలకొలది విద్యార్థులకు విద్యయును, విజ్ఞానము నొసంగి వారి యభివృద్ధికి తోడ్పడెను. వారు తమ విద్యాభ్యాసకాలమున భారతీయ నాగరకతను, మత సాంప్రదాయములను నిచట నెలుగగల్గిరి. అట్టి మాపాఠశాలకు ఈసంవత్సరం డిసెంబరు నెలలో "రత్నోత్సవము"ను వైభవముతో జరుప నిశ్చయించినారము. ఈ పాఠశాలయందు చదివిన పూర్వపు విద్యార్థులును, మిత్రులును, శ్రేయోభిలాషులును ఈ మహోత్సవ కార్యక్రమమునందు పాల్గొని, వారి ఆదరాభిమానములకు చిహ్నముగా యథాశక్తి ద్రవ్యసహాయమును చేయుదురని ప్రార్థించుచున్నాము.

## శ్రీ వేముల కూర్మయ్యగారు

నిమ్న జాతుల లీగు అధ్యక్షుడు శ్రీ వి. కూర్మయ్య యం. యల్. ఎ. గారు 27 తేదీన ఢిల్లీలో జరుగు ఆ. భా. ని. జా. లీగు కార్యవర్గ సమావేశమునకు అధ్యక్షత వహించుటకు నేడు కలకత్తా మెయిలులో వెళ్లుచున్నారు. ఢిల్లీ హరిజన కాలనీలో 29 తేదీన జరుగు ఠక్కర్ బాబా జన్మదినోత్సవములో పాల్గొనెదరు.

# తుపానుబాధితులకు సహాయం

## స్వామి రామానందతీర్థ విజ్ఞప్తి

హైదరాబాద్, నవంబరు 21: ఆంధ్ర దేశంలో యిటీవల వచ్చిన తుపానువల్ల అనేక కష్టనష్టములపాలైన బాధితుల సహాయార్థం హైదరాబాద్ సంస్థాన ప్రజలం దరు తమ శక్తి గొలది విరివిగా విరాళాలివ్వవలసిందని సంస్థాన కాంగ్రెస్ అధ్యక్షులు స్వామి రామానందతీర్థగారు నేడొక విజ్ఞప్తిచేశారు.

"హైదరాబాద్ ప్రజలకు ఆంధ్రదేశ ప్రజలకు సన్నిహిత సంబంధం ఉన్నది. కాబట్టి దురదృష్టవంతులై కష్టకాలంలో ఉన్న తమ సోదరులకు యీ పరిస్థితిలో సహాయపడటం హైదరాబాద్ ప్రజల విధి" అని రామానందతీర్థ అన్నారు.

సంస్థానంలో కాంగ్రెస్ సంఘములు, కాంగ్రెస్ వాదులు సహాయనిధులు సేకరించి, ఆంధ్రదేశానికి అన్నివిధములైన సహాయముచేయవలసిందనికూడ స్వామీజీ విజ్ఞప్తిచేశారు. కాంగ్రెస్ వాదులు యీ పనిని పవిత్ర కార్యంగా భావించి, యీ విషయంలో తాము చెయ్యకలిగినదంతా చెయ్యవలసిందన్నారు.

## ఆంధ్ర తుపాను నిధి

### రూ75,000 వసూలు

మదరాసు, నవంబరు 21: ఇండియా ప్రధాని పండిత నెహ్రూగారి రూ 25,000 చెక్కుతోపాటు మదరాసు గవర్నరుగారికి, ఆంధ్ర తుపానునిధి గూర్చి యిట్లు వ్రాసిరి: మీ విన్నపముద్వారా, మీ రాష్ట్రీయ శ్రేయనిధి ద్వారా చేస్తున్న కార్యములన్నీ జయమగుగాక.

గవర్నరుగారు ఆ చెక్కును, తూర్పు పంజాబు గవర్నరు పంపిన రూ 200 రాష్ట్రీయ క్షేమనిధికి పంపిరి.

జమినిస్టూడియో యజమానులు ఎస్. ఎస్. వాసనుగారు రూ 5000 యిచ్చిరి. ఇప్పటికి మొత్తం వసూళ్లు రూ 75,000 అందు ఆంధ్రమహిళా సభవారు రూ 7000 వసూలు చేసియిచ్చిరి.

### తుపాను నిధి-కార్పొరేషను తీర్మానం

ఆంధ్రదేశంలో తుపాను బాధితుల సహాయానికి రూ 5000 చందా యివ్వాలని కార్పొరేషను సంఘంలో అగ్గంటు తీర్మానం వచ్చే సభలో ప్రతిపాదించునట్లు ఎం. ఆర్. వి. ఆచారిగారు సూచించిరి.

### తుపానునిధికి రోటరీ క్లబ్బు సహాయం

మదరాసు, నవంబరు 23: మదరాసు రోటరీక్లబ్బువారు ఆంధ్ర తుపాను నిధికిగా 2000 యిచ్చుటకు, సభ్యులు విడివిడిగా అదనం చందాలిచ్చుటకు తీర్మానించిరి. క్లబ్బు గవర్నరు రోవ్ విక్టోరియాగారు, ఆహారశాఖమంత్రి ఆంధ్రజిల్లాలు యిదివరకు తమిళనాడుకి ఆహారధాన్యాలు యిచ్చేవారనియు, యిప్పుడు ఆ జిల్లాలకు సహాయంచేయుట మనవిధి యనియు చెప్పిరి.

## రాష్ట్రకాంగ్రెస్ కార్యాలయానికి చేరిన విరాళాలు

### కార్యదర్శి విజ్ఞప్తి

విజయవాడ, నవంబరు 20: ఆంధ్ర రాష్ట్ర కాంగ్రెస్ కార్యదర్శి కం. పేబుల రెడ్డిగారు ఇట్లు వ్రాసిరి:

మద్రాస్ గవర్నరుగారు ఏర్పాటు చేసిన ఆంధ్రతుపాను బాధితుల సహాయనిధికిగాను ఈ కార్యాలయానికి ఈ దిగువ విరాళాలు చేరినవి: చక్రధరపూర్ ఆంధ్ర సంఘం తరపున ఎం. కె. వి. శాస్త్రిగారు రూ. 101/-లు, గుంతకల్లు డి. టి. ఎస్. టి. ఆఫీసు సుమాస్తా, అక్షిలియరీ రిలీఫ్ కమిటీ కన్వీనరు పి. వెంకటేశ్వర్లుగారు రూ. 150/-లు, వాసిరెడ్డి వీరభద్రప్రసాద్ రూ. 116/-లు, పిఠాపురం యువరాజా రూ. 200/-లు, ఏలూరు హైస్కూలు ఉపాధ్యాయుల సంఘం రూ. 7-8-0.

ఈ సందర్భంలో ప్రజలంతా ఉదారంగా విరాళాలివ్వాలని, వాటిని మద్రాస్ గవర్నర్ సైక్లోనురిలీఫ్ ఫండ్ కోశాధికారికి (ఇంపీరియల్ బాంకుకు) నేరుగా పంపవలెనని కోరుతున్నారు.

### నేటపాలెం పంచాయతీబోర్డు విరాళం

చీరాల, నవంబరు 19: తుపాను బాధితుల సహాయార్థం నేటపాలెం పంచాయతీ బోర్డువారు మొన్న పన్నెం బాలాజీరావు నాయుడుగారి అధ్యక్షతను సమావేశమై రు 200/-ల విరాళమియిచ్చుటకు తీర్మానించిరి. ఆ మొత్తమును చీరాల డివిజన్ ప్లడ్ రిలీఫ్ కమిటీవారికి నిన్నరాత్రి అందచేసిరి.

### జాండ్రపేట పంచాయతీబోర్డు విరాళము

జాండ్రపేట పంచాయతీబోర్డువారు ..ండూరు శివప్రసాదరావుగారి అధ్యక్ష...

# తుపాను పీడిత ప్రాంతాలలో దాళవ పంటకు సదుపాయాలు

## ప్రభుత్వానికి స్థానికాధికారుల నివేదికలు

విజయవాడ, నవంబరు 22: తుపాను, వరదకు గురిఅయిన ఆంధ్రజిల్లాలలో కలిగిన నష్టం వివరములను ఆరయ శాఖల ఉద్యోగులు ప్రభుత్వమునకు నివేదించినట్లు తెలియుచున్నది. రెండవపంటకు విత్తనములు, ఎరువులు, రైతులకు వడ్డీలేని ఋణములు అవసరమని వీరు నివేదికలలో తెలిపినట్లు కూడ తెలిసినది. కొద్ది కాలములో ఫలసాయానికి వచ్చే తిరహా విత్తులు, దక్షిణాదిజిల్లాలనుంచి తెప్పించడానికి ఏర్పాట్లు జరిగినట్లు కూడా తెలిసినది.

కృష్ణాజిల్లాలో 20 వేల ఎకరాలలోను, తూర్పు, పశ్చిమగోదావరి జిల్లాలలో వరి పండే భూమిలో మూడవ భాగంలోను మాత్రమే దాళవాపంటకు అనువుగా ఉంటుందనీ, గుంటూరు జిల్లాలో ఇందుకు పనికివచ్చేభూమి పరిమితమనీ తెలిసినవారనుచున్నారు.

వ్యవసాయశాఖ డిప్యూటీ డైరెక్టరు కాంతి రాజ్ ఉత్తర దక్షిణ విశాఖ జిల్లాలు, తూర్పు పశ్చిమ గోదావరి జిల్లాలు, కృష్ణాజిల్లా పర్యటనచేసి, గుంటూరుజిల్లా పర్యటన నిమిత్తం ఒంగోలు వెళ్ళారు.

### వంశధారకు నివగాంవద్ద గట్టుపోత

ఆమదాలవలస, నవంబరు 23: విశాఖపట్నంజిల్లా కలెక్టరు, నివగాంవద్ద వంశధారకు రూ. 88 000/- లు పెట్టి గట్టు పోయించడ మగునని తెలిపి యున్నారు. దీనికి గాను గ్రామస్థులు రూ. 9 000/-లు ఇవ్వడానికి సమ్మతి తెలిపారు. దానిమీదట కలెక్టరుగారు, గ్రామస్థులు ఇచ్చిన మొత్తంతో తృప్తిచెంది పని త్వరలో ప్రారంభించ వలెనని ప్రభుత్వానికి గట్టిగా సిఫార్సుచేసెదమన్నారు.

వంశధారకు మదనపురంవద్ద ఒక డాము కట్టెదరనీ పాతపట్నం తాలూకాలో వీరంటు డిపో పెట్టెదరనీ కూడా కలెక్టరు గారు తెలిపిరి.

---

తమిళనాడు కాంగ్రెసు కార్యవర్గ సభ 27 తే ది. 10 గం కాంగ్రెసు శాసన సభ పార్టీ కార్యాలయమునందు జరుగును.

---

తను నిన్న సమావేశమై తుపానుబాధితుల సహాయార్థం రు 25/-లు యిచ్చుటకు తీర్మానించిరి. ఇదిగాక ప్రసాద్ గారు కొందరు మిత్రుల సహాయముతో గ్రామములో జరిగి షుమారు, రు 500/-ల మేరకు విరాళములు వసూలుచేసిరనియు యింకను విరాళములకు తిరుగుచున్నారని తెలియుచున్నది.

### నాటకప్రదర్శనం

చీరాల డివిజన్ తుపాను వరదబాధితుల సహాయ సంఘ యాజమాన్యమున తెనాలి నాట్యసభవారు నిన్నరాత్రి 'విప్రనారాయణ' నాటకం ప్రదర్శించిరి. నాట్యమండలి మేనేజరు నందూరు శేషాచార్యులుగారు నాటకప్రదర్శన ఉద్దేశ్యము దెల్పి, ప్రదర్శనకు ప్రోత్సాహమిచ్చిన ప్రేక్షకమహాశయులకు వందనములు అర్పించిరి.

నాటకం టిక్కెట్లద్వారానూ, విరాళములవల్లను సుమారు రూ 25,000/-లు వసూలుఅయినవని సంఘముతరఫున ఒకరు దాతలకు కృతజ్ఞత తెల్పిరి. విరాళములు సేకరించుటలో విశేషకృషి చేసిన ప్లడ్ తహసీలుదారు అద్దంకి వెంకట్రావు, చీరాల డిప్యూటీ తహసీల్దారు యం. ఆలీం మొహిద్దీన్ సాహెబు, మునిసిపల్ కమీషనరు వి. చంద్రారెడ్డి, చైర్మను అన్నదాత నాగేంద్రుడుగార్లు తదితర అధికార అనధికార ప్రముఖుల సేవలుకొనియాడుమా ప్రేక్షకులలో ఒకరు వారికి ధన్యవాదములు అర్పించిరి.

### తాడేపల్లిగూడెంలో కమిటీ ఏర్పాటు

తాడేపల్లిగూడెం, నవంబరు 20: ఈ తాలూకాలో తుపానువల్ల విపరీత నష్టానికి గురి అయిన వారికి సహాయం చేయుటకు పసల సూర్యచంద్రరావుగారి అధ్యక్షతను ఒక కమిటీ ఏర్పాటు అయినది. దీనికి కార్యదర్శి పి. యస్. యన్. శర్మగారు.

### బాధితులకు సొమ్ము పంపకం

నిడదవోలు, నవంబరు 20: కొవ్వూరు తాలూకా తహసీల్దారు ఎ. గంగరాజుగారు ప్రభుత్వం మంజూరు చేసిన సొమ్మును స్థానిక రెవిన్యూ యిన్స్పెక్టరు పి. సుబ్బారావుగారి సహాయంతో తుపాను బాధితులకు పంచిపెట్టిరి తాలూకాలో విరాళములు వసూలు చేయుటకు తుపాను బాధితుల సహాయనిధి సభ్యులు చేయుటకు కొవ్వూరు జమీందారు పి గంగారావుగారు అధ్యక్షులు, కె. సోమ్. వి. ఎల్. నరసింహారావుగారు కార్యదర్శిగా ఒక కమిటీ ఏర్పాటు అయ్యెను. (స్వ. వి)

# కృష్ణాజిల్లాలో సహాయ కార్యాలకు రూ. 4,00,000/-లు

## మద్రాసుప్రభుత్వం మంజూరు చేయుట

విజయవాడ, నవంబరు 23: కృష్ణాజిల్లాలో తుపాను, వరదల వల్ల నష్టపడిన ప్రాంతాల సహాయం నిమిత్తం ప్రభుత్వం నాలుగు లక్షల రూపాయలు మంజూరుచేసినట్లు తెలిసింది. (పి. టి. ఐ.)

# తుపానువల్ల కౌలుదార్ల కష్టనష్టాలు

## ఏలూరు తాలూకా కౌలుదార్ల మహాసభ తీర్మానాలు

ఏలూరు, నవంబరు 20: ఈ తాలూకా కౌలుదార్ల మహాసభ ఈ మధ్య ఇక్కడ దాసరి వందనంగారి అధ్యక్షతను జరిగింది. కోటే పుల్లయ్య, గరికముక్కల వెంకన్న గార్లు ఇటీవలి తుపానువల్ల పంటలు నష్టమైపోయినందున కౌలుదార్లకు కలిగే కష్టనష్టములను వివరించారు. షిమ్మట, ఎంత పిలిచినప్పటికీ, ఈ మహాసభకు హాజరు కానందుకు భూస్వాముల చర్యను నిరసిస్తూ ఈ సభవారి నిర్ణయములకు అంగీకరించని భూస్వాముల భూములను కోరలు కోని కుప్పచేసి, వారు అంగీకరించు వరకూ గాని, ప్రభుత్వం తీసుకునే చర్య తేలేంతవరకూ గాని, నూర్పులుంచ కూడదవలెనని, షరతులను అంగీకరించిన వారి కుప్పలను నూర్చవలెనని కౌలుదార్లను హెచ్చరిస్తూ తీర్మానించారు.

తుపాను చేనష్టపడిన ప్రాంతములలో, అదివరకు భూస్వామికీ, కౌలుదారుకూ జరిగిన కంట్రాక్టుతో నిమిత్తం లేకుండా, పంట చెరిసగముగా పంచుకొనవలసినదని నిర్ణయిస్తూ శాసనమొకటి వెంటనే చేయవలసినదనీ, ఈ సందర్భంలో ఆంధ్ర రాష్ట్ర కాంగ్రెసు పార్టీవల చేసిన తీర్మానమును అంగీకరింప వలసినదనిన్నీ, పంట నష్టమైన ప్రాంతమునకు రెండవ పంట సాగుకు అనుమతి యిచ్చి, విత్తనములు ఉచితముగా సప్లై చేయించవలసినదనిన్నీ, ఆ ప్రాంతములలో భూములకు పూర్తి రెమిషను న్నూ, పోరంబోకులు సాగుచేసిన బీదలకు పెనాల్టీల రద్దు చేయవలసినదనిన్నీ, వ్యవసాయకూలీలు, కౌలు రైతులు, వ్యవసాయ ఖర్చు నిమిత్తం ఈ సంవత్సరం చేసిన అప్పులను రద్దు చేయవలసినదనిన్నీ, మద్రాసు ప్రభుత్వమును కోరుతూ తీర్మానించారు. (స్వ. వి.)

# బీబీనగర్ కేసు వాయిదా

## 29 వ తేదీన ముద్దాయిల పరీక్ష

### ఆఖరి ప్రాసిక్యూషన్ సాక్షి క్రాసు పరీక్ష పూర్తి

హైదరాబాదు, నవంబరు 22: బీబీనగర్ కేసును విచారణచేస్తున్న ప్రత్యేక న్యాయస్థానంవారు నేడు ప్రాసిక్యూషనువారి ఆఖరిసాక్షి, గౌసు మహమ్మద్ ఖాన్ను పరీక్షించినతర్వాత, విచారణను నవంబరు 29 వరకూ వాయిదావేశారు. 40 వ సాక్షి గౌస్ మహమ్మద్ ఖాన్ ఈ కేసును దర్యాప్తుచేసిన సి. ఐ. డి. ఇన్స్పెక్టరు. నవంబరు 29 న న్యాయస్థానంవారు ప్రథమ పర్యాయంగా ముద్దాయిలను పరీక్షచేస్తారు.

కేసు విచారణ ప్రారంభమైనప్పుడు, కేసుకు సంబంధించిన రికార్డులన్నిటినీ పరిశీలించటానికి అనుమతించవలసిందని డిఫెన్సువారు పిటీషను పెట్టారు. దీనిని న్యాయస్థానాధ్యక్షుడు త్రోసివేస్తూ, పోలీసుల పత్రాలను చూడనివ్వటానికి న్యాయచట్టం ఒప్పుకోదనీ, కాని కావలిస్తే, సాక్షులు అంజేసేట పోలీసులకు, రైల్వేవారికి ఇచ్చిన వాఙ్మూలములను, పంచనామాలను చూడవచ్చునీ చెప్పారు.

సికిందరాబాదు రైల్వే మాజిస్ట్రేటును సమను చేయవలెనని డిఫెన్సువారు పెట్టిన పిటీషనును పంటోగారు అంగీకరించారు.

తరువాత సి. ఐ. డి. ఇన్స్పెక్టరు గౌస్ మహమ్మద్ ఖాన్ను క్రాసుపరీక్ష చేశారు. బీబీనగర్ సంఘటన తర్వాత వెంటనే రైల్వేపోలీసులు 9 మంది సాక్షుల నుండి వాఙ్మూలములు తీసుకున్నారు. నేరములకుగూర్చి మొట్టమొదటి రిపోర్టు యిచ్చినది రైల్వేపోలీసులే. కేసును దర్యాప్తుచేస్తూ గౌస్ మహమ్మద్ కొందరు సామాన్య సాక్షులనుండి కూడా వాఙ్మూలములు తీసుకున్నాడు. (పై 9 మంది సాక్షుల వాఙ్మూలములను, డిఫెన్సువారి కోరికమీద కోర్టులో ప్రదర్శించటానికి కోర్టువారు ఒప్పుకున్నారు.)

నాగర్ల అనే మనిషిని తాను ఎరుగుదుననీ, అయితే కేసు దర్యాప్తు సందర్భంలో అతనిని తాను కలుసుకోలేదనీ, గౌస్ మహమ్మద్ అన్నారు.

కోర్టువారు చార్జీలన్నిటిని క్రోడీకరించకముందు, కొందరు ప్రాసిక్యూషన్ సాక్షులను క్రాసుపరీక్ష చేయ నివ్వవలసిందని రి ముద్దాయి తరఫు న్యాయవాది హైదర్ రజా జాయిదీ కోరగా, వీలులేదని కోర్టువారు చెప్పారు.

### కమ్యూనిస్టు మరణం

సికిందరాబాదు, నవంబరు 22: అనేక హత్యలకు, లూటీలకు కారకుడైన పీరప్ప అనే పేరుమోసిన కమ్యూనిస్టును హైదరాబాదుజిల్లాలో ఒక గ్రామంలో గ్రామస్థులు చంపివేశారని తెలుస్తున్నది. గ్రామస్థులనుండి బలాత్కారంగా డబ్బు గుంజుకోవాలని పీరప్ప ప్రయత్నించాడనీ, వారు స్వరక్షణార్థం లాఠీలతో ఎదుర్కొని, అతనిని కొట్టి చంపారనీ తెలిసింది.

ఎల్లయ్య అనే మరొక కమ్యూనిస్టును గ్రామస్థులు బంధించి పోలీసులకప్పజెప్పారని కూడా తెలిసింది.

# అంతర్జాతీయ ద్రవ్యనిధి బాకీలు

## చెల్లింపుల ప్రారంభానికి గడువు

బొంబాయి, నవంబరు 22: అంతర్జాతీయ ద్రవ్యనిధినుండి డాలర్లు అప్పుతీసుకొని ఇండియా మొదలైన దేశాలు ఆ బాకీలు చెల్లింపులు ఫలాని గడువునాటికి ఆరంభిస్తామని చెప్పవలసి ఉంటుందట.

నిధికి సభ్యులుగా ఉన్నవారు, ఇతర దేశాలకు చెల్లు విషయంలో తాత్కాలికంగా ఏర్పడిన ఆర్థికచిక్కుల నివారణకు గాక ఇతర ప్రయోజనాలకు అప్పుపుచ్చుకొన్నారనే భావం వాషింగ్టను వర్గాలలో బలపడుతున్నందున డాలరుసహాయం తగ్గించడానికి అంతర్జాతీయ ద్రవ్యనిధివారు కొన్ని ఏర్పాటులు చేస్తున్నారట. వాటిలో బాకీ వసూలు గడువు ఒకటి.

ఈ ఏర్పాటు ఇండియాను అంతగా బాధించదట. ఏమంటే నాలుగేళ్ల కాలంలో ఇండియాకు రావలసియున్న 40 కోట్ల డాలర్ల ఋణాన్ని ఇండియా చాలా పొదుపుగా వాడుకొంటున్నది. 1948-49 లో ఇండియా 10 కోట్ల డాలర్లు మాత్రమే తీసుకొన్నది. ఈ సంవత్సరంలో కొత్త ఋణాలకోసం దరఖాస్తులు పెట్టలేదు. అదీకాక, ఈ ఋణం తీర్చడానికి ఆలస్యం జరిగినకొద్దీ వడ్డీరేటుకూడా పెరుగుతుంది కనుక ఇండియా ప్రభుత్వంవారు ఎక్కువగా ఈ ఋణాలమీద ఆధారపడటానికి ఇష్టపడటం లేదట.

ప్రస్తుతం కరాచీలో ఉండి పాకిస్తాను ప్రభుత్వంతో, పాకిస్తాను సభ్యత్వం గురించి చర్చలు జరుపుతున్న అంతర్జాతీయ ద్రవ్యనిధి కమిషను వారు కొద్దిరోజులలో బొంబాయికి వస్తారట. ఋణాలు సాధ్యమైనంత ఉపయుక్తంగా వినియోగపడే విధానాన్ని గురించి రిజర్వు బాంకు అధికారులతో మాట్లాడతారట.

మార్షల్ సహాయంపొందిన అంతర్జాతీయద్రవ్యనిధి సభ్యులు ఈ నిధినుండి అప్పు అపుచ్చుకోరాదు. డాలరు అప్పు లు తగ్గించి, చెల్లింపులు ఆరంభించడానికి గడువు ఏర్పాటు చేయడానికి ఇదికూడా ఒక కారణమని బొంబాయిలోని ఆర్థిక ప్రవీణులు చెబుతున్నారు. అయితే 1952 లో మార్షల్ సహాయం నిలచిపోయినప్పుడు చిక్కు ఏర్పడుతుంది. అప్పటికి సభ్యుల అవసరాలకు సరిపడే ద్రవ్యం నిధిలో ఉండ డానికిగాను ఈ ఏర్పాట్లు చేస్తున్నారట. తాత్కాలికంగా చెల్లింపులు డాలర్లు చాలక బాధపడే సభ్యులకుకూడా ఋణాలు లుచిక్కవా అన్న సమస్య కొందరిని బాధిస్తున్నది.

### ఉద్యోగవార్తలు

చెన్నపట్నం, నవంబరు 22:— శ్రీ వి. సుబ్రహ్మణ్య నాడార్ గారు సబార్డినేటు గుంటూరు జిల్లా సెషన్సు జడ్జిగా రిటైరు కానుండే జనాబ్ అబ్దుస్ సఫాగ్ గారి బదులు తాత్కాలికముగా నియమింపబడిరి.

డా॥ మిస్ వీ. బి. మూరికర్ విశాఖపట్నం స్త్రీల శిశువుల ఆసుపత్రి సూపర్నెంటుగా డిసెం॥ 1 వ తేదీనుండి నియమింపబడిరి.

# సంస్థాన రాజ్యాంగపరిషత్తులో మొత్తం 200 స్థానాలు

## డిసెంబరు 3 న ఓటర్ల జాబితాల ప్రకటన: వచ్చే మార్చిలో ఎన్నికలు

సికిందరాబాదు, నవంబరు 23: హైదరాబాదులో ఏర్పడనున్న రాజ్యాంగ పరిషత్తులో 200 మంది సభ్యులుంటారనీ, ముస్లిములకు, హరిజనులకు, ఆదిమవాసులకు జనాభా నిష్పత్తిమీద ప్రాతినిధ్యం కల్పించబడుతుందని నేడు ఒక ప్రకటన వెలువడింది.

82 వేల చ. మైళ్ల వైశాల్యంకల హైదరాబాదు సంస్థానం రెండు వందలమంది సభ్యులను ఎన్నుకొనటానికి వీలుగా మొత్తం 137 ప్రాదేశికనియోజకవర్గాలుగా విభజింపబడింది. ఎన్నికలు వయోజన ఓటింగుహక్కు ననుసరించి జరుగుతాయి.

ఓటర్ల జాబితాల ముసాయిదా రేపు డిసెంబరు 3 వ తేదీన ప్రకటింపబడుతుంది. ఇందులో మొత్తం 90 లక్షల పేర్లున్నాయి. ఈ జాబితాల మీద అభ్యంతరాలు తెలుపుకోదలచినవారు, అవి ప్రకటింపబడిన 30 రోజులలోగా పిటీషను పెట్టుకోవాలి. 1950 మార్చిలో ఎన్నికలు జరుగుతాయి.

ఈ విషయాలను వెల్లడిస్తూ హైదరాబాదు ఎన్నికల కమీషనర్ ఎస్. డబ్ల్యు. శేషయ్యంగార్ నేడు రేడియోలో ప్రసంగించారు. త్వరలో ఏర్పడబోయే రాజ్యాంగ పరిషత్తు సంస్థాన భవిష్యత్తును, ఇండియాతో దాని కట్టి సంబంధాలం. డాలో అనే విషయాన్ని గూర్చి నిర్ణయం చేస్తుందని ఆయన అన్నారు.

## నిజాంకు ప్రాధాన్యము ఇవ్వరాదు.

హైదరాబాదు ప్రజలతరఫున సంస్థానాన్ని ఇండియాలో చేరుస్తున్నానని ప్రవేశపత్రంపై నిజాంచే సంతకంపెట్టించరాదని, అసలునిజాంకు ఏమాత్రప్రాధాన్యము యివ్వరాదనీ, సంస్థానభవిష్యత్తును నిర్ణయించవలసింది ప్రజలేనని పండిట్ నెహ్రూ స్వయంగా అన్నమాటలకే ఇది వ్యాఘాతమవుతుందనీ హైదరాబాదుసోషలిస్టుపార్టీ కార్యదర్శి డి. ఎస్. మహావీర సింగు నేడు వరంగల్లులో ఉపన్యసిస్తూ అన్నాడు. రాబోయే రాజ్యాంగపరిషత్తు ఎన్నికల్లో తమపార్టీ పోటీచేస్తుందని కూడా ఆయన చెప్పారు.

## కూర్గు పరిపాలనలో మార్పు లేదు

### ఇండియాప్రభుత్వ నిర్ణయం

న్యూఢిల్లీ, నవంబరు 22: ప్రస్తుతమునకు కూర్గు యిప్పటివలె ముందుకూడ కేంద్రపరిపాలిత ప్రాంతముగా నుండవలెనని ఇండియా ప్రభుత్వమువారు నిర్ణయించినట్లు అధికారవర్గములద్వారా తెలిసినది. కూర్గు పరిపాలనా విధానములో మార్పేమియు నుండదు సంస్థానశాఖ సలహాదారకు శ్రీ వి. పి. మెనన్ గారును, హోంశాఖ కార్యదర్శి అయ్యంగారు నవంబరు 17 న ఢిల్లీలో 10 మంది కూర్గు ప్రతినిధులను కలిసికొని చర్చలు జరిపిరి. కూర్గుప్రతినిధులు కూర్గు పరిపాలన విషయమైన తమ అభిప్రాయములను తెలిపిరి. అనంతరము కూర్గును యథాప్రకారము కేంద్రప్రభుత్వ పరిపాలనలోనుంచ ప్రభుత్వమువారు నిర్ణయించిరి.

---

## పుణ్యానికి పోతే—

### 9 మంది యువకులకు జలగండం

నెల్లూరు, నవంబరు 23: కార్తీక బహుళ అమావాస్యనాడు సముద్రస్నానం చేస్తే పుణ్యంకదా అని మొన్న ఆదివారం నాడు సింగరాయకొండ యువకులు 52 మంది వూళ్లపాలెం సముద్రపు రేవుకు వెళ్ళారు. వారు స్నానం ముగించుకొని వస్తూ సముద్రానికి బక్కింగ్ హాం కాలువకూ మధ్య పోతేరు అనే చిన్న కాలవ దాటుకుంటుండగా కొందరు వెనుక వస్తున్న 12 మంది ఊబిలో దిగబడిపోయారు. ఇంతలో ఉప్పుకాలువలో పోటు రాగా వారు మునిగిపోయారు. వీరిలో ముగ్గురిని మాత్రం రక్షించగలిగారు. మద్దాలి సుబ్బారాయుడు, కాలంసెట్టి సుబ్బారాయుడు, తిప్పిక సత్యనారాయణ, వీరయ్య, కర్ణెట్టి కోటయ్య, మద్దాలి బుజ్జయ్య, గుర్రం నారాయణయ్య, ఎ. వెంకయ్య, చల్లా సుబ్బయ్య అను 9 మంది మునిగి చనిపోయారు. వీరి కళేబరాలు దరిమిలాను దొరికినవి. వాటిని సింగరాయకొండ తీసుకువెళ్లారు. పంచాయతీలో జలగండానికి గురి అయినట్లు తేల్చారు. (స్వ వి)

## భారతదేశంలో క్షయవ్యాధి తీవ్రత

### క్షయవ్యాధి నిరోధకుల సమావేశ హెచ్చరిక

"బొంబాయి, నవంబరు 23: "క్షయవ్యాధి పీడితులందరినీ తప్పనిసరిగా ప్రత్యేక కస్టడీల్లో విడిగా ఉంచాలని నిర్దేశిస్తూ ప్రభుత్వం వెంటనే శాసనం చేయవలసి ఉన్నది. మనదేశంలో ఇప్పుడు ఒకకోటి మందియినా ఈ వ్యాధి సోకినవార్ల ఉంటారు. వ్యవసాయ జీవనంనుంచి పారిశ్రామిక జీవితాన్ని అనుసరించే ప్రతిదేశంలోనూ క్షయవ్యాధి విజృంభిస్తుంది. అది మొదలు నగరాల్లోనూ, పారిశ్రామిక కేంద్రాల్లోనూ బయలుదేరి వాటితో సంబంధమున్న పల్లెలకుకూడా వ్యాపిస్తుంది. ప్రస్తుతం ఇండియాలో ఈ పరిస్థితి ఉన్నది. ప్రపంచంలో ప్రతి సం॥ క్షయవల్ల చనిపోయే 2 కోట్లలో 10 లక్షల మంది మనదేశంలో పోతున్నారు. ఇది ఎంతకు పెరుగుతుందో తెలియదు."అనికలకత్తా మెడికల్ కాలేజి మాజీ ప్రిన్సిపాల్ డా॥ ఎ. సి. ఉకీల్ గారు నేడిక్కడ ప్రారంభమైన క్షయవ్యాధి నిరోధకుల సమావేశానికి అధ్యక్షత వహిస్తూ హెచ్చరించారు.

"ఇండియాలో పారిశ్రామికోద్యమం ఇటీవలనే రావటంవల్ల వ్యాధిసోకేవారి దామాషా తక్కువగానే వున్నప్పటికీ చనిపోయేవారి సంఖ్య హెచ్చుగానే ఉన్నది. భారతీయ కర్మాగారాల్లో పనిచేసే పల్లెజనం క్షయవ్యాధికి చాల సులువుగా బలి అవుతున్నారు.

ఆర్థికంగానూ, సాంఘికంగానూ జీవితం వృద్ధిపొందటంవల్ల వ్యాధి నిరోధక శక్తి ఎక్కువవుతుందన్నమాట నిజమే కాని బి. సి. జి. మొదలైన వాక్సిన్లద్వారా కూడా నిరోధక శక్తిని వృద్ధిచేయటం అవసరం. కాని అన్నిటికన్నా ముఖ్యమైన అంశం వ్యాధిపీడితులను మిగిలినవారినుంచి విడదీసి ఉంచటమే. అందువల్ల ప్రభుత్వం దీనిని పొందుపరుస్తూ శాసనాలు చేయాలి.

### ప్రభుత్వ బాధ్యత

ఏ దేశంలోనైనా క్షయను నిర్మూలించేబాధ్యత ప్రభుత్వానికే ఉంటుంది. వ్యాధి నిర్మూలనానికి కావలసిన ధనసహాయాన్ని చేయటమే కాక సాంకేతిక సహాయం చేయటంలో, వ్యాధినిరోధక సంస్థలకు సలహాలివ్వటంలోనూకూడా ప్రభుత్వానికి బాధ్యత ఉన్నది. మనదేశంలో అత్యుత్తమమైన పరిశోధన సంస్థను స్థాపించవలసి ఉన్నది. వ్యాధిచికిత్సకు కావలసిన మందులు లభించటంలేదు. అందువల్ల వాటిని తయారుచేసే ఫ్యాక్టరీలను ప్రభుత్వం మనదేశంలోనే నెలకొల్పాలి వైద్యులందరికీ ఎప్పటికప్పుడు నిర్ణీతచికిత్స విధానాన్ని బోధపరుస్తూ ఉండాలి.

వ్యాధిని నిరోధించటంలో మరొక ముఖ్యాంశం వ్యాధిపీడితులనూ, వారికుటుంబాలనూ పోషించటం, వ్యాధినివారణ అయిన తరువాత వారికి జీవనోపాధి కలిగించటం. ప్రభుత్వ తోడ్పాటు లేనందువల్ల ఇది మనదేశంలో ఎంతో ఉపేక్షించబడినది. ఏకాగ్రక్రమమైన సఫలం కావలెనంటే ప్రభుత్వ శాసనాల తోడ్పాటు అవసరం" అని ఆయన వివరించారు.

### అమృతకౌర్ ప్రసంగం

సమావేశాన్ని కేంద్ర ఆరోగ్యమంత్రి రాజకుమారి అమృతకౌర్ ప్రారంభిస్తూ భారతదేశంలో క్షయవ్యాధి నిర్మూలనను సక్రమంగా నిర్వహించడానికి మొదటన400 కోట్లను పెట్టుబడి పెట్టటమేకాక ప్రతిసం॥ 100 కోట్లను వెచ్చించవలసి ఉంటుంది అని వక్కాణించింది.

"అతి సాధారణమైన ఎస్తులో క్షయవ్యాధి నిర్మూలనానికి పూనుకోవాలన్నా మనదేశంలో కనీసం 4 వేల క్షయ ఆస్పత్రులు, 5 లక్షల పడకలు, 15 వేలమంది డాక్టర్లు, 50 వేలమంది నర్సులు, అంతమంది ప్రచారకులు కావలసి ఉంటుంది. ప్రస్తుతం దేశంలో 8 వేల పడకలు; 125 ఆస్పత్రులు, 2,00మంది వైద్యులు, చాలకొద్దిమంది నర్సులు ప్రచారకులుమాత్రం ఉన్నారు. దేశంలో ప్రతిఏటా క్షయవల్ల లక్షలమంది చనిపోతున్నారు. 25 లక్షలమంది పీడితులున్నారు. ప్రపంచ ఆరోగ్యసంస్థ తోడ్పాటుతో ప్రభుత్వం బి. సి. జి. వాక్సినేషన్ ఏర్పాటు చేసింది. దానిలో లక్షమంది. వాక్సినేటు చేయబడ్డారు 8 లక్షలమంది పరీక్షించబడ్డారు. అని ఆమె వివరించినది సభలో డా॥ జీవరాజ్ మెహతా, డా॥ గిల్డర్ మొదలైన ప్రముఖులు, 150 మంది ప్రతినిధులు పాల్గొన్నారు.

# ఫలుక్నామాభవనంలో రాజాజీకి ఆతిథ్యం

## ప్రపంచంలో సాటిలేని సౌందర్యంకల మహల్

హైదరాబాదు, నవంబరు 23: హైదరాబాదుకు వచ్చేనెలలో విచ్చేయనున్న గవర్నర్ జనరల్ రాజగోపాలాచారిగారికి ఇక్కడికి 5 మైళ్లదూరంలో నున్న ఫలుక్ నామా భవనంలో ఆతిథ్య సత్కారం నెరపబడుతుంది. ఈభవనం నిజాం నవాబుగారి అతిథి భవనాలన్నిటిలోకీ విశాలమైనదే కాక అతిరమణీయమైనదికూడాను.

ఇదివరకీభవనంలో అతిథులుగాపంచమజార్జి చక్రవర్తి, అప్పటి వేల్సు యువరాజు, ఎందరో గవర్నర్ జనరలులు, వైస్రాయిలు సత్కారం పొందారు. ఇది ఒక కొండమీద వున్నది. అక్కడ నుండి నగర దృశ్యమంతా కనిపిస్తుంది. భవనంచుట్టూను క్రింది అంతస్తులోనూ ఉద్యానవనం ఉన్నది. అంతర్భాగంలో చిత్రకళా వైభవమంతా గోచరిస్తుంది. స్వాగత మందిరంలో విలువైన రగ్గులు, కేయ్యాసనాది సామగ్రి వున్నాయి.

కొన్ని అలమరాలలో వజ్రవైడూర్యాలు పొదగబడిన వస్తువులు గత యుద్ధానంతరం వరకు ఎల్లాలేదన్నా 28 లక్షల పౌనుల ఖరీదైనవి. అలంకరించబడిన వి. భవనంలో ఎక్కడచూసినా చలవరాతి తిన్నెలు, నీటిబుగ్గలు, వర్ణచిత్రశోభితమైన కుడ్యములు కనిపిస్తాయి. ఎంతో ఖరీదైన గ్రంథాగారం ఒకటి ఇక్కడ వున్నది. పైఅంతస్తుకు వెళ్ళే మెట్లను చలవరాతి కమ్ములున్నవి. మెట్ల ప్రక్కన అక్కడక్కడ చలవరాతి శిల్పాలున్నవి. మొత్తంమీద ఈ భవనాంతర్భాగ సౌందర్యం ప్రపంచంలో దేనికీ తీసిపోదని విలువకట్టబడినది. (స్వ. వి.)

## ఆంధ్ర కాంగ్రెస్ నాయకుని నిరశనదీక్ష విరమణ

గత ఆదివారం నుండి నిరశన దీక్ష నవలంబించిన ఆంధ్ర (ఢి) కాంగ్రెస్ కార్యదర్శి రామమూర్తి నాయుడు. జనార్దన రావు దేశాయ్ గారు కోర్కెం చేసుకొన్న మీదట గత రాత్రి దీక్ష విరమించారు. ఇటీవలి కాంగ్రెస్ ఎన్నికలలో కాంగ్రెస్ అధికార వర్గంవారి ధోరణికి అసమ్మతి సూచకంగా ఈయన దీక్షకు పూనుకున్నారు.

## పోటీ వర్గాలమధ్య సంప్రదింపులు

### డి. జి. బిందూగారికి రాజీకుదిర్చే భారం

హైదరాబాదు, నవంబరు 22: సంస్థాన కాంగ్రెసులో రెండువర్గాల మధ్య ఏర్పడిన ముఖ్య విభేదాలను తొలగించటానికి తిరిగి ప్రయత్నం జరుగుతున్నది. రెండు వర్గాలకు సంధికుదిర్చే భారాన్ని దిగంబరరావు బిందూగారే యింకా వహిస్తున్నారు. స్వామి రామానంద ఢిల్లీ వెళ్ళేముందు, అవతలి వర్గంవారితో సంప్రదింపులు జరపటానికీ, రాజీపడే మార్గం వెదకటానికి బిందూగారికి అధికార మిచ్చారని తెలుస్తున్నది. ఉభయ వర్గాలకు కలిగిన అభిప్రాయ భేదాలను, గుల్బర్గ ఎన్నికల విషయమై వచ్చిన శ్రీ తీర్థగారితో సహా, అన్నిటినీ బిందూగారు పోటీవర్గ నాయకులతో ప్రస్తుతం చర్చిస్తున్నారని కూడా తెలుస్తున్నది. స్వ. వి.

## ఉద్యోగులకు విద్యాపూర్తి సౌకర్యాలు

ప్రభుత్వ కార్యాలయాల్లోను, ఇతర చోట్లను పనిచేసే ఉద్యోగులు తమ విశ్వవిద్యాలయవిద్యను పూర్తిచేసుకోవటానికి వీలుగా ఉస్మానియా విశ్వవిద్యాలయం వారు ప్రత్యేక తరగతులను ప్రారంభించాలని నిశ్చయించారు.

ప్రస్తుతానికి జూనియర్ ఇంటర్మీడియేట్, జూనియర్ బి. ఏ., జూనియర్ బి. ఎస్సి. తరగతులు మాత్రమే ప్రారంభిస్తారు.

## 400 మణుగుల విర్చి రహస్య రవాణాయత్నం

### హైదరాబాద్ ఉద్యోగుల చాకచక్యంవల్ల విఫలమగుట

భద్రాచలం, నవంబరు 20: హైదరాబాదు ప్రాంతంనుంచి అల్లిగూడెం రేవు సమీపంనుంచి యూనియన్ ప్రాంతానికి రహస్యంగా రవాణా కానున్న 400 మణుగుల విర్చిని, 11 వ తేదీన హైదరాబాదు కస్టమ్సు, పోలీసు శాఖల ఉద్యోగులు పట్టుకొని జప్తు చేసినట్లు తెలిసినది. ఆసరుకును వారు ...పాడు చేర్చినట్లుకూడా తెలిసినది. స్వ. వి.

VICTO
GERMICIDAL SOAP
CONTAINS MERCURY BINIODIDE
VICTORY CHEMICAL & PHARMACEUTICAL WORKS LTD., PALAKOL

### టెండరు నోటీసు

మద్రాసు ప్రావిన్షియల్ వెల్ఫేర్ ఫండ్, గుంటూరు డిస్ట్రిక్టు కమిటీ, గుంటూరు.

గుంటూరు జిల్లా అద్దంకిలో, ఒక మెటర్నిటీ వార్డున్ను, శిశు సంరక్షణ కేంద్రమున్ను నిర్మించుటకు టెండర్లు కోరబడుచున్నవి. వాటి గాని, గుంటూరులోని, హైవేసు డివిజనల్ యింజనీరుకు గాని వ్రాసి యీ కట్టడముల వివరములు, ప్లాను పొందవచ్చును. టెండర్లు పెట్టదలచినవారు మద్రాసు ప్రావిన్షియల్ వెల్ఫేర్ కమిటీ, గుంటూరు బ్రాంచి ఖాతాన, లోకల్ యింపీరియల్ బ్యాంక్ ఆఫ్ ఇండియాలో, రు 500/-ల ధరావతు సొమ్ము జమకట్టవలెను. సదరు చలాను టెండరుతో జతపరిచి 30-11-1949 తేది లోగా దాఖలు చేయవలెను.

(సం) పి. వి. కృష్ణయ్య చౌదరి,
ఛేర్మన్.

### నోటీసు

శ్రీమంతురాజ్ఞీ పర్లగడ్డ వెంకట దుర్గాంబ బహద్దర్ గారికి కృష్ణాజిల్లా దివి తాలూకా పెదయాదర గ్రామములో ఉండుచున్న శేరీబాపతు పల్లం భూములు మింజుమలె య 600- ఆరువందల యకరముల భూమి, సదరు భూములలో యున్న వారి సావిళ్లు వద్ద, ది 1-12-49 తేదీన ఉదయము 10 గంటలకు వేలం పాడించి విక్రయించబడును. పాటలో పాల్గొనువారు ముందుగ రు 500/-లు అయిదు వందల రూపాయిలు ధరావతు దాఖలు చేయవలసి యుండును. మిగతా పాట షరతులు పాటకాలమందు తెలుపబడును.

విక్రయించబడు భూములు తాలూకు డీషన్రీ నెంబర్లు: స్రం. 472 నుంచి 475, 478, 479, 482 నుంచి 489, 493 నుంచి 499, 507 నుంచి 515, 519 నుంచి 526, 548, 549, 560, 569 నుంచి 573, 577 నుంచి 579, 581 నుంచి 598, 600 నుంచి 605, 607 నుంచి 609, 611 నుంచి 640, 642, 643, 645 నుంచి 666.

పింగళి గోపాలరావు,
ఏజంటు, 19-11-49.

వీూబిడ్డ జబ్బుగానుండి అవస్థపడుచున్నయెడల బి. సి. పి. డబ్లియు.
గ్రైప్ మిక్శ్చర్
దివ్యంగా పనిచేయును.
అజీర్ణము, పిత్తము, బంక విరేచనములు, పండ్లువచ్చుకాలమున సాధారణముగ కలుగు జబ్బులు వగయిరా అన్నిటిని కుదుర్చును.
BENGAL CHEMICAL
Calcutta :: Bombay
ఏజంట్లు: ఎకా. రేకాయ గౌండర్ అండ్ కో.
41. బందరువీధి, మద్రాసు.

మీ భోజన పదార్థములద్వారా ఎక్కువ పుష్టిని సంపాదించాలంటే దీనిని, సేవించండి-
గ్లాకోవిటా
గ్లూకోజ్-డి
శక్తిని వృద్ధిపరచు ఆహారము
కారన్ ప్రోడక్ట్సు కంపెనీ (ఇండియా) లిమిటెడ్.
పోస్టు బాక్సు నెం. 994, బొంబాయి.
డిస్ట్రిబ్యూటర్లు :-
పేరీ అండ్ కంపెనీ లిమిటెడ్,
పోస్టు బాక్సు నెం. 12 మద్రాస్.
CP-5-TEL

# ఆరు ప్రత్యేక ఆర్డినెన్సులకు శాసననిర్మాణంసమాప్తి

## ఇండ్ల అద్దెల కంట్రోల్ చట్టానికి రాష్ట్రశాసనసభామోదం

మదరాసు, నవంబరు 24: అసెంబ్లీ సమావేశమునందు ఎన్నడు లేనంత చురుకుగ నిన్న పని జరిగింది. గవర్నరుగారు అమలుజరిపిన ఆర్డినెన్సులు ఆరు, చట్టములుగా, ఒక్క ఇండ్లద్దెలచట్టంతప్ప తక్కినవి చర్చలేకుండా అంగీకరింపబడి, సభ అర్ధఘంటముందుగ ముగిసెను. ఆ చట్టము లేవన: ఇండ్లద్దెల కంట్రోలుచట్టం, మదరాసు మద్యనిషేధ సవరణచట్టము, ఔషధముల కంట్రోలు చట్టం, రయితు కౌలుదారుల రక్షణచట్టం, ప్రయివేటు అడవులరక్షణచట్టం, జనుము వస్తువుల కంట్రోలు చట్టము.

మదరాసు అసెంబ్లీ నిన్న ఉదయం స్పీకరు జే. శివషణ్ముగం పిళ్లెగారి అగ్రాసనతను సమావేశమైనపుడు ప్రశ్నోత్తరముల తరువాత మంత్రి శ్రీ యన్. సంజీవ రెడ్డిగారు 1946 సం॥ మదరాసు కట్టడముల అద్దె కిచ్చుటను గురించిన అద్దె విషయమున అధికారమును వహించుటను గురించిన ఆక్టు యొక్క నిబంధనలను పూర్తిగా పునర్న్యసించుటకు 1949 సం॥ బిల్లును సభవారి ఆలోచనకు ప్రతిపాదిస్తూ మదరాసు ప్రజాశాంతి రక్షణ శాసనము విషయమున అక్టోబరు 10 వ తేదీని హైకోర్టువారు చేసిన తీర్మానము బట్టి యీ కట్టడముల కంట్రోలు బిల్లును మదరాసు గవర్నరు గారు ఆర్డినెన్సు రూపమున శాసించినారనియు ఆర్డినెన్సు 6 వారాలలో తప్పక శాసన సభలో ఆమోదించబడి శాసనము కావలసిన అవసరమున్నందున సభవారు బిల్లును వెంటనే ఆలోచనకు తీసుకొనవలెనని కోరిరి.

బేగం అమిరుద్దీన్ గారు యీ ప్రస్తుత బిల్లు పూర్తిగా వెనుకటి బిల్లు వంటిదిగా మాత్రమే యున్నదనియు, అందులో క్రొత్త సవరణ చేర్పకుండా శాసనము చేయించుట సరికాదనియు పలికిరి.

శ్రీ యల్. సి. పెయిస్ గారు రేపైనా యిండ్లు అతి స్వల్పమైన అద్దెకు కొంత నిర్ణీత కాలంవరకు వదిలి యున్నట్టయితే అట్టి భవనముల యజమానులు అద్దెను పెంచుటకు యీ శాసనంలో అవకాశం లేకున్నదనియు అట్టి అధికారము నొసగుటకు క్రొత్త శాసనమున నొకషరతు చేర్చుట అవసరమనియు నుడివిరి.

హుసేన్ గారు యీ బిల్లు 6 వారాలలోగా శాసనం కావలసి యున్నందున ప్రస్తుతము దీనిని త్వరలో శాసనము చేసి తరువాతైనా అవసరమైన మార్పులు సవరణలు గలబిల్లును డిసెంబరులో జరుగనుండే సమావేశంలో ప్రవేశపెట్టి శాసనముసునట్లు చూడవలెననిరి.

శ్రీ టి. విశ్వనాధంగారు ఇండ్లయజమానులకు అద్దెవార్లకు మధ్యగల సంబంధములను సరియైనవిధమున నిర్వచనచేసి నొకసమగ్రమైన శాసనము శాశ్వతముగా నుండునట్లు చేయడం చాలా అవసరమనిరి. మొదట యీ బిల్లును 1945 లో రెండేండ్ల వరకని యిప్పుడు ఒకసంవత్సరంవరకని తెలుపుట వింతగానున్నదనిరి. రాష్ట్రములో గృహసమస్యవల్ల ప్రజలు చాలా యిబ్బందులకు గురియగుచున్నందున ఈ కష్టములు తొలగించుటకు వీలుపడునట్టి సమగ్రశాసనము ఎప్పుడుయుండుట చాలా ముఖ్యమనిరి. ఇండ్లఅద్దెలు వెనుక 1940 సం॥ పరిస్థితిగమనంలో నుంచుకొని నిర్ణయించుటకు 1946 సం॥ శాసనమున అధికారము యివ్వబడినదనియు యిప్పుడు కార్మికులకూలీ చాలా పెరిగిపోయి వున్నందున గృహములనురమతుకు ఎక్కువ ద్రవ్యము వ్యయముచేయవలసి వచ్చుచున్నదనియు ఈ విషయమునుగమనము లోనుంచుకొని అద్దెలు నిర్ణయించుటకు క్రొత్తషరతు చేర్చవలెననియు కోరిరి. క్రొత్తగా కట్టబడుభవనము యింటియజమాని మొదటగృహప్రవేశము చేయక ముందు అట్టివాటికి ఖాళీభవనము నిర్వచనము వర్తించనట్లు మంత్రిగారు ఉత్తరవు చేయవలెననిరి.

మునిసిపాలిటీలకు యిండ్లుకావలసి యుంటే వారికి భవనములు దొరుకుట కష్టముగానున్నదనియు ప్రభుత్వమువారు తమ అవసరాలకు కావలసిన భవనమును యే విధముగా ప్రత్యేకించుకొనుటకు అధికారమున్నదో పురపాలక సంఘాలకు కావలసిన యిండ్లవిషయముకూడా అపద్ధతే వర్తింపచేయవలెననియు పలికిరి. ఈ సూచనలన్నీ ఆలోచించుటకు సెలెక్టుకమిటీని వెంటనే నియమించితే యీ సాయంత్రమే సవరణలన్నీ ఆలోచించి రేపు ఎల్లుండిలోగానే బిల్లు శాసనముగునట్లు కూడా చేయ వీలున్నది. గాన ప్రభుత్వము బిల్లును సెలెక్టుకమిటీకి నివేదించుట మంచిదనిరి.

మజీదుగారు యింండ్ల యజమానులు పెద్దమొత్తాలు అడ్వాన్సు అప్పనంగా తీసుకొనడం చాలా విరివిగా సాగుచున్నదని యీ దురాచారమును ప్రభుత్వము అణచవలెనని పలికిరి.

శ్రీ కే. వరదాచారిగారు ఖాళీగా ప్రకటితమయ్యే యిండ్లు భవనముల కంట్రోలర్ మొదట ప్రభుత్వమువారి అవసరములు పబ్లిక్ సంస్థల అవసరములు తృప్తిచేసిన తరువాత మిగిలితే ప్రైవేటు ప్రజకు అద్దెకు యిచ్చునట్లు చూడవలెననిరి. యజమానులు మధ్యతరగతి ప్రజలను అడ్వాన్సులు అడిగియు మరి యితరత్రా విశేషధనము కోరి పీడించుటను నివారించవలెననిరి.

ఆ జ్ఞానరీ, చిదంబర అయ్యర్ గార్లు యిండ్లఅద్దె కంట్రోలుబిల్లు యజమానులు, కాపురస్థులను యిబ్బంది పరచకుండా సవరణలు చేయవలెననిరి.

రజాఖాన్ గారు వెనుకటి బిల్లులో గల లోపాలు అందరికి బాగా తెలిసియేయున్నదనియు, అట్టిబాటిని సవరించుటకు యీ బిల్లును సెలక్టుకమిటీకి నివేదించుట ముఖ్యమనిరి. మంత్రిగారు బిల్లును సెలెక్టుకమిటీకి నివేదించవమనునని వెనుక అభిప్రాయము తెలిపికూడా యిప్పుడు సెలెక్టుకమిటీ నియమించకపోవడం కూడదనిరి.

ప్రభుత్వము తమ ఉద్యోగులకు కావలసిన గృహములు కట్టి యివ్వవలెననిరి. చెన్ననగరములో యిండ్లు ఉన్నవారు కొందరు గాంధీనగరులో సయితం భవనము పొందగల్గి యున్నారనియు యిండ్లు లేనివారికని తలపెట్టియున్న యీ సహకార స్కీములలో అసలు యిండ్లు గలవారికి కూడా సభ్యత్వం ఒసగడం బాగా లేదని విమర్శించిరి. అంతటితో సభవారు ఫలాహారమునకు లేచిరి.

### ఇండ్ల అద్దెల కంట్రోలు బిల్లు ఆమోదం

#### ఫలాహారానంతరం చర్చ

ఫలాహారానంతరం అసెంబ్లీ సమావేశమైనపుడు శ్రీ యల్. యన్. గోపాలస్వామి గారు ఇండ్ల అద్దెకిచ్చుటగూర్చి అద్దెల నిర్ణయించుటగూర్చి కంట్రోలు యుండుట అనవసరమనిరి.

శ్రీ యన్. యం. ఆర్. సుబ్బరామన్ గారు కొందరు కాపురస్థులు స్వంతముగా తమ యిండ్లను కట్టుకొన్నతర్వాతకూడా స్వంతయిల్లును ఎక్కువ అద్దెకు వదలి బాడుగ యింటిలోనే యుంటున్నారనియు అలా జరుగనీయరాదనియు చెప్పిరి.

ఫెర్నాండెజ్ గారు బిల్లును సభవారు వెంటనే ఆలోచించవలెననే ప్రతిపాదనను బలపరుస్తూ యజమానులనుండి బాధలకు గురియగుచున్న అద్దెవారుల హక్కుల రక్షించుటకు బిల్లును త్వరలో శాసనము గావించి తరువాత అవసరమైన సవరణలు మార్పులు ఆలోచించుటకు పూనవచ్చుననిరి. ఇండ్లకొరతవల్ల యుంటే యిబ్బంది తొలగించవలెనంటే యిండ్లు విస్తారముగా కట్టబడుటకు ప్రభుత్వము తన ప్రోత్సాహము నొసంగవలెనని కోరిరి.

#### మంత్రిగారి జవాబు

మంత్రి శ్రీ యన్. సంజీవరెడ్డిగారు విమర్శలకు సూచనలకు సమాధానమ్లిస్తూ యీ బిల్లు ఊరక వెనుకటి శాసనమును పునరుద్ధరించుటకే తేబడియున్నదనియు సభ్యులు యీ విషయమై తెలిపిన సూచనలు ప్రభుత్వము సమగ్రమైన సవరణ శాసనము తేదలచునపుడు ఆలోచించి అనుసరించుటకు ఉపకరించగలవనిరి. ఈ బిల్లు వెంటనే శాసనము గావించవలసిన అవసరము ఉన్నందువలనే తొందరగా దీనిని శాసనము గావించవలసియున్నదనిరి.

జిల్లాప్రాంతాలలో యిండ్ల కంట్రోలు అధికారము ఆర్. డి. ఓ.ల నుండే వీరైతే అఫీషియల్ రిసీవర్లకు మార్చుటగూర్చి ప్రభుత్వం ఆలోచించవచ్చుననిరి. అన్సారిగారు కోరినట్లు యిండ్లు మరమతు కావలానికి అద్దెదార్లను తొలగించుటకు అధికారమొసగితే కాపురస్థులను యజమానులు ఊరకనే తొందరపెట్టడం జరుగవచ్చుననిరి. శ్రీ గోపాలస్వామిగారు చెప్పినప్రకారం అసలు కంట్రోలు పొందడం అనవసరమనే భావనతో శాసనీకరింపవలెనని వ్యక్తిగతముగా యిష్టమున్ననూ ప్రస్తుత వర్తిని పరిస్థితులలో కంట్రోలు లేకపోవడం సమంజసం కాదనిరి.

ఇండ్లఅద్దె కంట్రోలుకేసుల అపీళ్లు పరిష్కారమగుటకు ఆలస్య మగుచున్నదనే విమర్శకు బదులుచెప్తూ నగరములో కలెక్టరునుండి యీ కంట్రోలు అధికారము మార్చి సబార్డినేటు జడ్జికి ఒసగే ఆలోచన ప్రభుత్వానికి యున్నదనిరి. జిల్లాలలో కంట్రోలు వ్యవహారములను చూచుకొనుటకు ప్రత్యేకాధికారులను నియమించుట విశేషవ్యయముతో కూడిన పనియగుటగాన సాధ్యపడదనిరి. అవసి కారులకు సయితం యిండ్లను చూచిపెట్టే బాధ్యతకూడా ప్రభుత్వం వహించవలెనంటే పరిపాలనావ్యయ మెక్కువగుననిరి. ఇండ్ల యజమానులు పగ్డీ మొత్తాలను తీసుకొనుచున్న ఆచారమును అణచవలెనని ప్రభుత్వము కొందరు సి. ఐ. డీలను పంపి విచారణచేయగా కాపురస్థులు సయితం నిజము చెప్ప వెనుదీయుచున్నారనియు అట్టి సందర్భములలో ప్రభుత్వము యేమియు చేయలేక యూరుకోవలసి వచ్చినదని పలికిరి.

తరువాత బిల్లుపై క్లాజువారీ చర్చ జరిగెను. శ్రీ మునగాల పట్టాభి రామయ్య క్లాజు 2 (1) చివర ఒక మనిషికి కాపురముండు నిమిత్తముగాని, ఇతర కార్యములకు గాని కట్టడములు కట్టుటకు అద్దెకు యిచ్చు ఖాళీస్థలములుకూడ ఈ చట్టము క్రింద కట్టడముగా ఎంచవలెనని సవరణ ప్రతిపాదించిరి. శ్రీ యల్. యన్. గోపాలస్వామిగారు ప్రతిపాదనను బలపరచిరి.

ఈ సవరణవల్ల బీదలు బాధపడెదరని శ్రీ కందసామిపిళ్లె అనిరి.

శ్రీ సంజీవరెడ్డిగారు జవాబు ఇచ్చుచూ ఖాళీస్థలములను కంట్రోలు చేయు అవసరము ఏమీ కనబడుటలేదనిరి. అవసరమైన యెడల దరిమిలా ఈ సవరణను పరిశీలించెదమని సవరణను ఉపసంహరించుకొనగోరిరి.

శ్రీ పట్టాభి రామయ్యగారు సవరణను ఉపసంహరించుకొనుచు అద్దెకు వుండువారికి లాభము, న్యాయము కలుగచేయుటకు ఈ సవరణ అవసరమనిరి.

శ్రీ కే. వరదాచారిగారు క్లాజు 3 లో సబ్ క్లాజు (3) సబ్ క్లాజు (4) గా "సబ్ సెక్షన్ (1) క్రింద నోటీసు అందిన వారము రోజులలోగా (1) సబ్ సెక్షన్ (2) లో ఉదహరించిన కార్యములకు కట్టడము అవసరములేని యెడల కట్టడమును ఏ మనిషికి అయినా అద్దెకు ఇవ్వవచ్చుని తెలుపవచ్చును" అని చేర్చవలెనని సవరణ ప్రతిపాదించిరి.

ఒక మనిషిని వెళ్ళగొట్టుటకు అవకాశమున్నప్పుడు అట్టి మనిషికి నివాసము చూపించవలసిన బాధ్యత వుండవలెననిరి. కనీసం అద్దెయిజర్లు చూపినదయ అయినా ప్రజాప్రభుత్వము ప్రజలపట్ల చూపవలెననిరి. శ్రీ తెన్నేటి విశ్వనాధముగారు సవరణను బలపరచిరి. శ్రీ కందసామిపిళ్లె సవరణను బలపరచిరి.

సవరణ చూపులకు స్వల్పముగా కనిపించిననూ అమలు జరుపునప్పుడు చాలచిక్కులు రాగలవనిరి. ఈ సవరణను అంగీకరించిన దరఖాస్తు దార్లందరికి ఇళ్లు చూపించుట చాలకష్టమని మంత్రి సంజీవరెడ్డిగారనిరి శ్రీ వరదాచారిగారు సవరణను ఉపసంహరించుకొనిరి.

క్లాజువారీ అంగీకరించబడిన తరువాత శ్రీ సంజీవరెడ్డిగారు బిల్లును అంగీకరించవలెనని ప్రతిపాదించిరి. సభవారు అంగీకరించిరి.

### మదరాసు మద్యనిషేధ సవరణబిల్లు

తరువాత మదరాసు మద్యనిషేధబిల్లును శాసన మొనర్చవలెనని మద్యనిషేధ మంత్రి ప్రతిపాదించిరి.

శ్రీ తెన్నేటి విశ్వనాధంగారు మాట్లాడుచూ మద్యనిషేధవిధానము గురించి విమర్శ తీవ్రముగా యున్నదనిరి. మద్యనిషేధము పట్ల ప్రభుత్వమునకు విశ్వాసమున్న యెడల ప్రభుత్వము ఒక్క పర్మిటుకూడా ఇవ్వకూడదు. మద్యనిషేధ చట్టము అమలుకంటే చట్టఉల్లంఘన ఎక్కువగాయున్నదనిరి. ప్రతిం చెడ్డా ఫలం దక్కవలెను, మద్యనిషేధ విధానమును పునః పరిశీలించవలెననిరి. శ్రీ యన్. యం. ఆర్. సుబ్రహ్మణ్యం, హైడ్రాస్ బిల్లును సమర్థించిరి. శ్రీ కోటిరెడ్డిగారు కాలంమారింది, మన పోయింపులు సర్వసాధారణముగా ఇవ్వనవసరము లేదనియు బిల్లును ఉపసంహరించు కోవలెననిరి.

శ్రీ సంజీవరెడ్డిగారు ఈబిల్లును ఉపసంహరించుటకు వీలు లేదనిరి. రాష్ట్రములో దేశీయులకు పర్మిట్లు చాల తక్కువయున్నవి. విదేశీయులకు ధారాళముగా ఇచ్చుచున్నామనిరి. పర్మిటు పద్ధతినే వీలుంటే తీసివేయవలెనని యున్నదనిరి. ఆబిల్లు శాసనముగా అంగీకరించబడెను.

### డ్రగ్సు కంట్రోలు చట్టం

మంత్రి రోఘువీర్ట్రోరియాగారు ఔషధముల కంట్రోలు చట్టమును ప్రతిపాదించుచు రూపాయి విలువమారినాక మందుల ధరలు పెరిగిపోకుండ చూచుటకు వాటి విక్రయ, సప్లయిపంపకం ఖాయిదా చేయుచు ఆర్డినెన్సు అమలు జరుపబడెననియు, దానినే చట్టంగా యిపుడు ప్రతిపాదించుచున్నామనియు చెప్పిరి.

శాచిలరుగారు ఉత్పత్తిదారులను యిందలి కొన్ని క్లాజులనుండి మినహాయించాలని సూచించిరి. చట్టం క్లాజువారీగా అంగీకరించబడెను. 95 క్లాజులో రూ 5 మించిన విక్రయాలకు రసీదు యివ్వాలి. తక్కువవాటికి యివ్వనక్కరలేదనిగలదు. అన్నింటికి బిల్లుయివ్వాలని ఒక సభ్యుడు సూచించెను. మంత్రిగారంగీకరించలేదు. చట్టం అంగీకరించబడెను.

### రయితుల రక్షణ చట్టం

రివెన్యూమంత్రిగారు ప్రతిపాదించిన ఈ బిల్లుకూడ ఆర్డినెన్సుకి ప్రతిగా చేయబడిన చట్టము. చర్చ లేకుండా అంగీకరించబడెను.

ప్రయివేటు అడవుల రక్షణ చట్టమును రివెన్యూ మంత్రిగారు ప్రతిపాదించిరి.

అడవులను 30 సం॥ల వరకు పెంచక 20 సం॥ల తరువాత కొట్టవచ్చునన్నచో వంటచెరకు ఎక్కువ రాగలదు, అడవులకు నష్టం రాగలదనియు కోటి రెడ్డిగారు సూచించిరి. ఆవిషయం ఆలోచించెదమని మంత్రిగారు బదులు చెప్పిరి.

మూడవ ప్రతిపాదనయంగైన యీ చట్టం ఎందుకు చేస్తున్నారో మంత్రిగారు చెప్పరాదా, అని విశ్వనాధంగారు కోరిరి, అచ్చువేసిన బిల్లులో తెలిపితిమని మంత్రిగారనిరి. చట్టం చర్చలేకుండా అంగీకరించబడెను.

### జనుము కంట్రోలు చట్టము

పాకిస్తానువారు రూపాయి విలువ మార్చనందున, జనుము వ్యాపార పరిస్థితులు తారుమారయినందున, ఇండియా ప్రభుత్వంవారు యితర దేశాలతో చేసుకున్న కంట్రాక్టులు అమలు జరుపుటకై యీ కంట్రోలు చేయుట అవసరమయినదనియు, అందుకని ఆర్డినెన్సు తొందరగ చేయవలసి వచ్చిందనియు, దానినే యిపుడు చట్టం చేశితిమనియు మంత్రి మాధవమీననుగారు చట్టం ప్రతిపాదించుచు తెలిపిరి.

విశ్వనాధంగారు — ఇదివరకున్న కంట్రాక్టులు రద్దుచేసుకుని ప్రభుత్వంవారు కోరిన సరుకే తయారుచేయాలని ఈ చట్టం శాసించుచున్నది. అట్లు చేసిన ఫ్యాక్టరీ వారికి వచ్చే నష్టానికి ఎవరు బాధ్యులు?

మంత్రి—జనుముపంట ఈరాష్ట్రంలో చాల తక్కువ. ఫ్యాక్టరీ వారిని సరకు మార్చి తయారు చేయుమని ప్రభుత్వంవారు ఉత్తరువు చేసినచో నష్టం వారే తప్పక భరించెదరు.

చట్టం అంగీకరించబడెను. సభ 4-30 గ. లకు ముగిసెను. రేపుదయం ఎలక్ట్రిసిటీ చట్టం చర్చింపబడునని అధ్యక్షులు ప్రకటించిరి.

#### గా॥ చంద్రమౌళి పర్యటన

స్థానిక శాఖామాత్యుడు శ్రీ కే. చంద్రమౌళిగారు యీనెల 30 తేదీ రాత్రి చెన్నపురి నుండి బొంబై మెయిలులో బయల్దేరి హోస్పేట వెళ్లెదరు. మరుసటి రోజున హర్పనహళ్లిలో పంచాయతీ బోర్డు ఆఫీసు శంకుస్థాపనము జరుపుతారు. 2 వ తేదీ బళ్లారి, డిశం. 3 వ తేదీ మధ్యాహ్నం బయల్దేరి 4 వ తేదీ ఉదయం చెన్నపురి జేరెదరు.

25-11-49 నుండి విడుదల
మదరాసు సెలెక్టులో
ఆదివారమువరకు మాటినీలు
ఇతర ఆటలు సాయంత్రము 6-15, రాత్రి 9-30 గంటలకు.
పాటలతోకూడిన జే. ఎం. ఆర్. పిక్చర్సువారి,
సాంఘిక చిత్రము
"షాం - సవేరా"
నటించినది:-
స్వర్ణలత, వాస్తి, సులోచనా చటర్జీ.

దివ్యమైన తరుణం
దూది, వెండి బంగారం, విత్తులు మొదలైన వాటియొక్క రెడీ, ఫార్వర్డ్ వ్యాపారానికి మెషినరీ, సబ్బులు, కాస్టిక్ సోడా, కత్తులు మొదలైన సామానుల సప్లయికి "బొంబే బిజినెస్ డైలీ రిపోర్టు" సంప్రదించండి. పేరుగాంచిన పురాతనమైన సంస్థ, మిక్కిలి అనుకూలమగు షరతులు.
గోయెల్ బ్రదర్సు అండ్ కంపెనీ లిమిటెడ్,
ఎగుమతిదారులు, దిగుమతిదార్లు, కమిషన్ ఏజంట్లు:
నవ్‌సారి ఛేంబర్సు, హార్నబీ రోడ్డు, ఫోర్టు, బొంబాయి.
Grams: Goelfrend ఫోన్: 81449.

మధుర మిల్సు కంపెనీ లి.,
సంతోషపూర్వకముగ తెలియపరచునదేమన,
డిస్ట్రిబ్యూషన్ కంట్రోలు సడలింపబడినందువల్ల, మార్కెట్టులలో వారి నూర్లు క్రమేణా ఎక్కువ ధారాళముగా దొరకును.
ఇదివరకు మాతో వ్యాపారము చేసిన ఖాతాదారు లందరికి కృతజ్ఞతను వెల్లడించుచు, వారికి తిరిగి సేవ చేయ గలమని ఆసించుచున్నాము.
మిల్లులు; మధురై, ట్యూటికోరిన్, అంబాసముద్రం.
మానేజర్లు: ఏ. అండ్ ఎఫ్. హార్వే లిమిటెడ్, మదురై.

రహదారి నియమములు
మీ భద్రతకొరకే
30 MILES
ఎల్లప్పుడు వేగపరిమితిలోనే పొమ్ము
వేగంగా తోలుట అపాయకరమైన ప్రాంతాలలో వేగపరిమితులు విధింపబడియున్నవి. వాటిని నిర్లక్ష్యం చేస్తే మీయొక్క ప్రాణాలకేగాక మీ ప్రాణానికి కూడా హాని కలిగించగలరు.
రహదారి నియమములు, సూపర్ ఇండియా టైర్లకులే, మీ భద్రతకొరకే నిర్దేశింపబడినవి.
ఎరుపు రింగును గమనించుడు
సూపర్ ఇండియా
టైర్లలో సర్వోత్తమమైనవి.

Edited, Printed & Published by S. Sambhu Prasad at the Andhra Patrika Press
NTo 7, hambu Chetty Street, G. T. Madras.